

# గోవర్ధనోద్ధారణము.



ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచల వాంతవారి ధా
రాయుత చంద్రకాంత ఫలకావళి బింబితమై చెలంగ నా
రాయణమూర్తి మత్కవచ రత్నముచేఁ బరిరక్షఁ గాంచెనా
నాయదువీర! వృష్టిఁబసి యూరడఁబోవవె సప్తరాత్రముల్

ఆము క్తమాల్యద.




మా ఱ కి ము,
శ్రీగౌరీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1928.

శ్రీరస్తు.

శ్రీశోభనాద్రీశ్వరోవిజయతాతామ్.

శుభమస్తు.

# గోవర్ధనోద్ధారణము

---

ఇది

## శ్రీరాజా వేంకటాద్ర్యప్పా[illegible]

నూజవీడు.



కవిప్రశంస

శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు.

పర్యాలోకన

శ్రీమద్దివ్యాగ శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులుగారు

నూజవీడు,

శ్రీగౌరీ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

1928.

శ్రీ ర స్తు.

శ్రీశోభనాద్రీశ్వరో విజయతామ్.

శ్రీకాంతామణికి నాత్మసద్మముపయిన్ ♦ శీతాద్రిసంజాతకున్
లోకాద్యంబు నగంబునంతటను, వా ♦ గబ్జాక్షి వాస్యంబునన్
జేకొంచున్ భువనాళిఁ బెంచి, తుదకున్ ♦ శిక్షించి, సృష్టించు, మూ
డాకారంబులఁ దాల్చి వెల్గు పరత ♦ త్త్వాధీశునిన్ గొల్చెదన్.

ఉ. పల్లవకామినీనయన ♦ వారిచరంబులు, కేశబృందభృం
గోల్లసనంబు, దివ్యరుచి ♦ రోక్తిజలాండజరాజనాదమున్
సల్లలితాననాబ్జచయ ♦ సంగతినొప్పు సుహాసవారిలో
నల్లననాడు కృష్ణగజ ♦ మంచిత సత్కృపమమ్ముఁ బ్రోచుతన్.

మ. వరగోపీనయనాబ్జరాజి యలరన్ ♦ వైఖంబ దేవేంద్ర బం
ధుర గర్వాంధతమంబునోవఁ గను సం ♦ తోషంబుతో ధేనువుల్
కెరలన్ భానుకరంబుపోల్కి మను పే ♦ కెంగేలు గోవర్ధనం
బురుసౌలభ్యముతోడ నెత్తె మదిలో ♦ నూహింతు నాహస్తమున్.

శు భ మ స్తు.

# పాత్రపట్టిక.

1 కృష్ణుడు.

2 గోపకులు.

3 గోపికలు.

4. విప్రకన్యలు.

5 బలరాముఁడు.

6 నందుడు.

7 దేవేంద్రుఁడు.

8 బృహస్పతి.

9 భటుఁడు.

10 అప్సరసలు.

11 ద్వారపాలకుఁడు.

పౌరుషంబున ఘన్న ♦ పరిపోషణంబున
దక్షిణాపథమేలి ♦ నిజతేజమహిమను
కల్పకాలమును వెల్గు ♦ కాకతీయరాజ్య
వీరభూపాలురు ♦ విజయసేనలకు ;
నాయకుల్గా దండ ♦ నాథులుగాను
నెఱపిన్ని వెలమభూ ♦ నేతలానాడు
శౌర్యవిఖ్యాతి బా ♦ జనులుగాఘనులై ;
ఆసద్మ శైలనూహ్య ♦ యంబులోన
బిరుదగద్యలుగొన్న ♦ విఖ్యాతగోత్ర
వరుల సత్పారాయ ♦ వంశభూషితుడు
ఘన దానధర్మార్థ ♦ ఖనియైనవాడు
నుయ్యూరు మాండలి ♦ కోర్వీధవుండు
నైన రాజారంగ ♦ యాప్పారాయనికి
పుత్రయోగప్రాప్తి ♦ పాత్రధన్యుండు
ఘనవీరేంద్రులరీతి ♦ గన్నట్టియాతండు
నాంధ్రాంగ్లభాషలం ♦ దభ్యాసకుండు
సూరివర్గహితుండు ♦ సుజనసమ్మతుడు
నైనట్టి శ్రీవేంక ♦ టాద్ర్యప్పరాయ
రుచిర వాగ్వైభవు నై ♦ ఱుంగ శేవిూరు!
ఆకవిరాజేంద్రుఁ ♦ డతికౌశలమునఁ
బ్రహ్మంబుసను బృథ్వీ ♦ రాయాంతకృతియు
–నా నెన్న దుర్యోధ ♦ నాంత రూపకము
వరుసగా మఱికొన్ని ♦ పద్యమాలికలు
లిఖియించి యిప్పుడు ♦ లీలావతారు

శ్రీకృష్ణదేవుని • చిత్రచారిత్ర
లందొక్క కథయావ • కాకృతితోడఁ
దనరు గోవర్ధనో • ద్ధారణంబనగ
పలుకు పల్కునఁదేనె • లొలుకరచించె
నానాటకము యిప్పు • డాడుచున్నార
మరసి యానందింపుఁ • డయ్య మీరెల్ల
వేళమించవటంచు • వినువఁడయ్య
యారంభమగు నాట • కాభినయంబు
వినవచ్చునల్లదే • వేణుగానంబు
చెవులఁదన్పుచునుండెఁ • జిలుగజ్జెరవళి
యాలకింపుండదే • యంభారవంబు
హోహో యనెడి గోప • కుల కూఁతలవిగో!
వేణుగోపాలునను • వేంచేయుచుండె
సావధానులుగండు • సాధువులార!

(పుష్పాంజలివిడచి నిష్క్రమించుచున్నాఁడు.)





శ్రీ ర స్తు.

శ్రీశోభనాద్రీశ్వరోపిజయతామ్.

శుభమస్తు.

# గోవర్ధనోద్ధారణము.

## ప్రథమాంకము.

ప్రవేశము—గోపబాలురు.

1 వ గోప—చో్చ! చో్చ! ఇటు. ఇటు. అరరే! చూచితిరా! ఈయాఁబోతు మనమాటలఁ జెవిఁ బెట్టక, తన యిచ్చవచ్చిన దారినే పోవుచున్నదే!

2 వ గోప—మఱలు. మఱలు. ఓహో! దీనికి నొడలంతయుఁ బొగరెక్కి, కొమ్ములకెగఁబ్రాకినదిరా. కావున నెదురైన వారిపై సంత తలవిసరుచుఁ బైబడుచున్నది.

3 వ గోప—ఓరీ! దీని నాప మన తరముగాదురా! కృష్ణుఁడైనను బలరాముఁడైనను రావలెనురా!

4 వ గోప—ఇదే మన కృష్ణుఁడిటకు వచ్చుచున్నాఁడు. ఓరి! కృష్ణా!

(మురళి వాయించుచు కృష్ణుఁడు ప్రవేశించును.)

కృష్ణు—ఏమి! ఏమి యుపద్రవము వచ్చినదిరా! అట్లు కేకలు వేయుచున్నారు.

1 వ గోప—కృష్ణా! ఈయాఁబోతు మామాట వినకున్నదిరా! నీవు పోయి దాని నావలకుఁ దోలిరమ్ము.

కృష్ణు—అదిచాల సాధువృషభమే. ఇట్లేల చేయుచున్నది! మీరు దానిని గఱ్ఱలతోఁ గొట్టి రెచ్చఁగొట్టియుండవలెనురా! (తనచేతిలోనికఱ్ఱను గ్రిందఁబడవైచి) నేనిదే దాని నదల్చి వచ్చెదను.

గోపాలురు—వలదు. వలదురా! కృష్ణా! అదిచాలఁ గోపముగానున్నది. నీవు కఱ్ఱలేక దాని సమీపింపరాదు.

కృష్ణు—కఱ్ఱయుండిన మాత్రము నాకెట్టి సహకారి యగును? నీకు తెలియ దూరకుండుము. (నిష్క్రమించును.)

3 వ గోప—చూచితిరా! వింత. మనల జూచినంతటనే, చెవులనిక్కించి, తలవంచుకొని బుసకొట్టుచు వెంటబడినది. కృష్ణుఁడట్టెపోయి యట్టె మెడ నిమురఁగా నాతనిచేయి నాకుచున్నది.

4 వ గోప—మన కృష్ణునియొద్ద నేదో మాయ యున్నదిరా.

కృష్ణు—(ప్రవేశించి) ఓరీ! ఆఁబోతు దానికదియే పోయినది చూచితిరా.

1 వ గోప—నీకేమైన మంత్రము వచ్చునా! కృష్ణా!

కృష్ణు—వెఱ్ఱులారా! కన్నులతోఁ జూచుచుండియు నిందును మంత్రమున్నదనుచున్నారా? దీని రహస్యము చెప్పెద వినుఁడురా.

తే. గీ. భూమినేదైన సాధింపఁ ♦ బోవునపుడు
దాని కనుయుక్తమగుదారిఁ ♦ దలపవలయుఁ;
గరుణచేతను వశమైన ♦ కరణిఁ బశులు
శౌర్యమున నెల్లవేళల ♦ సాధ్యపడవు.

తే. గీ. కాంచరే! మీరు కొట్టంగఁ ♦ గోపముఁ గినిసి
పొడువఁగావచ్చు వృషభమేఁ ♦ బోయి దయను
దువ్వ, శాంతించి తనదారిఁ ♦ దొలఁగిపోయె
మంత్రమని మీరు వెఱ్ఱులై ♦ మదిఁ దలంప.

1 వ గోప—మేము దువ్విసదాఁక నెక్కడిది? అది చూడఁగనే మా పై ఁబడుచుండె.

2 వ గోప—పోసీరా! కృష్ణా! ఈ యొక్కదాని కిట్లుంటివి. అదిగో మేము మేపు మందలు చూడుము. నీవు మేపునది చూడుము. నీవన్నియు బలిసి, నవనవలాడుచు, బాగుగఁ జూచిన దృష్టి తగులునేమో యనునట్లుండ, మావి బక్కచిక్కి జోరీఁగలతోఁ గొట్టుకొనుచు, నెట్లెట్లోయున్నవి. దీనికేమందువు.

కృష్ణు—అరెరే! ఇదికూడ మంత్రబల మనియేనా మీబుద్ధి, నావలెనే మీరుకూడ మీగోవులను శ్రద్ధతోఁ గాపాడుచున్న యెడల నవి యును బలిసి బాగుగ నుండునురా! అట్లుగాక మీరు మీమీ మందల నడవికిఁ దోలి, యేదియో యొక చెట్టునీడను గోలి కాయలో, కోతికొమ్మచ్చులో యాడుకొనుచు మఱల సాయం కాలము దనుక మందల నంకనే చూడక యవి యేపులిపాలనో, యే చిఱుత చేతనో పడినదియైన నెఱుఁగకున్న వాని గతి యెట్లుండునురా! ఇఁక నేనో—

1 వ గోప—నీవు పిల్లనగ్రోవి వాయించుచు గోపికలతో నాడు చుందువు.

కృష్ణు—ఓరీ! నేనట్లాడిననేమి? నా మిత్రగణములైన గోవులపని యే మఱుదునా! ఉదయమునసే గోవులఁ దీసికొని, లేఁత పచ్చిక గలచోట్లు వెదకి మేపుదును. వానికే క్రూరమృగంబుల వల నను భయంబు గలుఁగకుండఁ దఱచు మందచుట్టును దిరుగు దును. ఏదైన నొక దాని కించుక రోగసూచనలు చూపట్టె నేని, తోడనే మన యయ్యలతోఁ జెప్పి దానికి మందిప్పించు దును. మందలోఁగల ప్రతి గోవునందును స్నేహ భావంబున మెలఁగుచు, వాని నన్నిటి నాతోఁబుట్టువులుగా నెంతును ఇఁక నే గోపికలఁగూడి పాడిననేమి? కోఁతులతోఁ జేరి యాడిననేమి?

అదిగాక మీరు దృష్టిదోషము తగులునని యేదియో చెప్పు చున్నారు. శరీర జాడ్యముచే నేదియైనఁ గృశించి చెడిపోవలెను గాని, చూచి మెచ్చుకొన్నంత మాత్రమున నేయుపాయమైనఁ గలుగఁ గలదా! అదిగో! మీగోవులలో మంచివానికిఁ దలలకు గొమ్ములకు వెండ్రుకల దాళ్లు, పాలిజెగవ్వలపేరులు నింక నేవేవియో కట్టియున్నారు. అదిగో! ముద్దులు మూటగట్టు నాలెల్ల యావుపస కేమైనఁ గట్టితినా! దానియందము చూడుడు.

సీ. నిండు చందురునివె ♦ న్నెలఁబోలె శాంతమై,
ధవళమై, నునుపైన ♦ తనువుతోడఁ
వాటమౌవంపుతో ♦ వరమనోహరములై
నిగనిగ ల్గలకొమ్ము ♦ సొగసుతోడఁ
బుణ్యకాంతముఖంబు ♦ పోలిక సిరులొల్కు
ముద్దుమూటలఁగట్టు ♦ మోముతోడ
నమృత భాండముభంగి ♦ నమలమై క్షీరసం
పూర్ణత నిండైన ♦ పొదుఁగుతోడ

తే. గీ. సమరభూముల సమమ నా ♦ కమల విహర
ణంబు సేసెడి విధమున ♦ నాలమంద
లందుఁ దిరిగెడునాయావు ♦ నందమెంచఁ
గమలభవునికి నాశ్చర్య ♦ కరముగాదె.

ఏదిరా! దానికింక నేదృష్టియుఁ దగులలేదేమి? పిచ్చియూహల విడిచి మీగోవులఁగూడ భద్రముగఁ గాపాడుదురేని నావాని వలెనే మీవియు బాగుగ వర్ధిల్లఁగలవు.

1 వ గోప—సరియే! సమాధానముల కేమి లెమ్ము. ఎవరిగుట్టు వారు వెలికిఁ జెప్పెదరా. పోనిమ్ము, ఆవులగురించి యిట్లు చెప్పితిని. అద్భుతములైన నీయితర చర్యలగురించి యేమందువు! అవి

మనుష్యుల కసాధ్యములేకదా! నీయొద్దఁ దప్పక యేదియో యొక గొప్ప మాయయున్నది.

కృష్ణు—ముసలమ్మలతోఁ బాటుగ మీరుకూడ నాపనులఁ బొగిడు చున్నారా! ఇంచుకంత ధైర్యము గలిగిన నవి యెల్లరకు సులభములే సుమా!

సీ. గాలివైచినను మోయఁ ♦ జాలక మురుకంపు
ధరఁగూల నాదేటి ♦ పరుసఁదనము
అల్లరింజ్లేసారి ♦ యడరి వచ్చినవారి
కోపం బడంగించు ♦ టే పటిమము
వడి నింగి కెగయని ♦ నిసుదకాళ్ళబకంబు
మెడ రొక్కు. టేపాటి ♦ గమనఁదనము
మొసలక పడియున్న ♦ ముసలిపాముని వల
మట్టించుటదియెంత ♦ మగతనంబు,

తే. గీ. మదిఁ దలంపక మీరలు ♦ మానవులకు
సాధ్యములు గావనెడు నాదు ♦ చర్యలెల్ల
నించుకంత ధైర్యంబుతో ♦ నెవఁడు చేని
సులభముగ మీకుఁజేయంగ ♦ వీలునుపడవె.

అదిగాక సోదరులారా! మనసారఁ బూనిరేని సత్యపరాక్రమ వంతులకు నసాధ్యమొకటి యున్నదటరా? మనము నాందీపులవారి కడ చదువు కథలను తలపునకు దెచ్చుకొనుడు.

సీ. సగర నందనులు తు ♦ రగముకై భువిఁద్రవ్వి
చెలఁగి మున్నీరుగాఁ ♦ జేయలేదె
ఘనతపోనిధియగా స ♦ గస్త్యుండు కోపించి
సాగరోదకమెల్లఁ ♦ దావలేదె?
వీరులౌ వానరుల్ ♦ విక్రమంబున భూరి
గిరివరంబుల నూడఁ ♦ బెఱుకలేదె?

తనమాట నిలుపంగ ♦ మును గాధిసందనుం
డపరదివంబుఁ జే ♦ యఁగ లేదె

తే. గీ. శక్తియుతులకు దైవంబు ♦ సాయమున్న
నలవిగానిది చూడ నీ ♦ యవని లేదు
నీవునేను సయ్యాదిగాంచి ♦ నివ్వెఱఁగున
విపులమాయాబలం బంట ♦ వెఱ్ఱితనము.

1 వ గోప—పోనిమ్ము. కృష్ణా! నీవు మాస్నేహితుఁడవని యడిగితిమి. నీగుట్టు నీవుచెప్పక యేవేవియో సమాధానములు చెప్పుచున్న మరల నోరెత్తము లెమ్ము.

కృష్ణు—చెలికాఁడా! నిజముచెప్పిన నిష్ఠురమా!

2 వ గోప—సరికాని, నీవిన్నినీతులు చెప్పువాఁడవు, నింత తెలిసిన వాఁడవుగదా మొన్న గోపికలు స్నానముఁ జేయుచుండగా వారి గుడ్డలఁ దలపై నిడుకొని చెట్టున కెగఁబ్రాఁకితి వెందులకు; మనలో మనమాట; ఏమిచెప్పుము.

కృష్ణు—(నవ్వి) ఓరీ! ఇదిమీకెట్లు తెలిసినది?

4 వ గోప—ఆగోపిక లేవచ్చి పల్లెయంతయుఁ జెప్పితి.

కృష్ణు—(నవ్వి) ఓహోహో! అట్లా! నీవేల యాపనిఁ జేయవలెనని యడుగుచున్నారు; కావునఁ జెప్పెద, సోదరులారా! నామనసులో నీభువిఁగల కార్యములందు నెక్కువ తక్కువలు లేవుసుఁడీ! నా కన్నియు నొక్కరూపే. మాయమ్మ యశోదముద్దఁ బాలు ద్రావుటెంత సులభమో, ఘోర రాక్షసులతోఁ బోరి వారి రక్తము పీల్చుటయు నంత సులభమని నా యభిప్రాయము. ఉట్టిపై నున్న కుండఁ దూఁటు పొడుచుట యెంతగొప్పయో, మదించిన యేనుఁగు కుంభస్థలముల రంధ్రముల నొనర్చుటయు నంతటిదనియే నానమ్మకము. అనేక వీరులఁద్రుంచి, శత్రు

రాజుల పతాకము మోసికొనివచ్చు టెంతఘనకార్యమో, నేఁ మఱియున్న గోపికల వస్త్రములఁ దలపైఁ బెట్టుకొని పారిపోవు టయు నాకంతటి ఘనకార్యసే.

చ. కువలయమందుఁ గర్మముల ♦ గొప్పది చిన్నది యన్నభేదభా వవిధము లేదు నాకుఁ బశు ♦ వర్గము లన్నిటిఁ జిన్నకట్టెతోఁ దవిలి మరల్చునట్లు వడి ♦ ధానుజెయున్, భువనాళిఁ జిట్టునన్ దివిఁ బనిగొంపనేర్తు నిదె ♦ తెల్పితి నాదగు చిత్రచర్యలన్.

ఉ. బాలకులార! మచ్చరిత ♦ భంగుల నిక్కమెఱుంగ నెవ్వరుం జాలరు; నాకు నిష్టమగు ♦ చందము వర్తిలుచుందు నెందు; నా లీలల కడ్డమూబలము ♦ లేదు; జగత్త్రితయంబులోని జీ వాలిని నాడఁజేయుచు న ♦ నంత కృపామతిఁ గాంతు నెల్లరన్.

ఉ. కావున మన్మనోవిహిత ♦ కార్యము లెప్పుడుఁ జేసి, నిర్దయన్ భావమునుండి తోలి సమ ♦ భంగిని ప్రాణులఁ గూర్మిఁ గాంచినన్ శ్రీవిభవంబుల న్బడసి ♦ చేరుదు రుత్తమమౌ పథంబు; దు ర్భావముగల్గు కూరులు వి ♦ పత్తులపాలగు చుంద్రుమిత్రమా!

2 వ గోప — నీవిప్పుడు చెప్పినదాని కంతకు నాకర్థమైనఁ దెలియలేదు. పోనిమ్ము. నీవుమాకు మిత్రుఁడవు మేము నీకు హితులము. ఇంత చాలదా!

కృష్ణు — నాకుఁ గావలసినదే యంత, తక్కిన తెలివితేటలున్నను లేకున్నను నాకొక్కటియే.

3 వ గోప — మేము వట్టి మోటువారము. ఐనప్పటికిని నీవారము. ఏకే నీవింతదాఁక జెప్పిన యాపెద్దపెద్ద యూటలలో మమ్ముఁ జేర్చుకొనరాదా?

కృష్ణు — నాకంతకంటెఁ బరమానందము వేఱుగనున్నదా! ఇదిగో ఇప్పుడొక చిత్రము చేసి వేడుక నందుదము.

1 వ గోప— } సరి కాని యిప్పుడు మాకాఁకలిగా నున్నది. ఇండ్లకుఁ
2 వ గోప— } బోయి భుజించి మరల వచ్చి యాడుకొందము.

కృష్ణు—ఇప్పుడంతదూరము పోనవసరము లేదు. ఈయాటలో మీ యాఁకలి గూడ తీరనున్నది.

3 వ గోప—కృష్ణా! ఏదైన నగాధ సంకటమున మమ్ముదింపి వేడుక చేయఁదలచితివా!

కృష్ణు—మిమ్ముదింపి నేనుకూడ దిగఁనాడనే. భయపడవలదు. అదిగో ఆవనములో గొప్ప ధీమంతులుగా నటించుచున్న బ్రాహ్మణు లేదియో, యజ్ఞము చేయుచున్నారు, కనఁబడుచున్నదా?

1 వ గోప—ఆ!

కృష్ణు—వారల కడకుఁబోయి మేమందఱము చాల నాఁకలిఁ గొని యుంటిమనియుఁ గావునఁ గొంచె మన్నము పెట్టుఁడనియు నడుగుఁడు.

1 వ గోప—పోయినవారల కన్నమిడకుండుట యట్లుండగా వారి యాగభూములఁ జేరఁబోయితిమని తన్ని పంపరుగదా!

2 వ గోప—ఆ! తన్నిన మనమేనా యూరకుండువారము!

కృష్ణు—మీకెందులకు భయము? మీమొదలిపై దెబ్బ పడునంతేని వచ్చిన మూఁడులోకములు తలక్రిందులు కావలెను. పొండు.

1 వ గోప—సరే పోయెదము.

(గొల్లబిడ్డలు నిష్క్రమింతురు.)

3 వ గోప—కాని దీనిలోవేడుక యేమున్నది? వారికిష్టమైన నన్నము పెట్టెదరు. లేకున్నఁ బొమ్మనెదరు.

కృష్ణు—నీవూరక చూచుచుండుము.

4 వ గోప—వారు మనకన్నము పెట్టరేమో.

కృష్ణు—పెట్టక పోవచ్చును.

4 వ గోప—ఇంక మన కన్నమో?

కృష్ణు—దానికదియే వచ్చును.

3 వ గోప—అదెట్లు?

కృష్ణు—అదియే దీనిలో వింత. విప్రులు మన కన్నము పెట్టరు. ఐనను మన కన్నము దొరకఁగలదు.

4 వ గోప—ఎట్లు దొరకును? అదిగో! మనవారి నాదారినే రావలదని యెవ్వరో యాటంక పెట్టుచున్నారు.

3 వ గోప—బ్రతిమాలుకొని యదే వనము లోనికిఁ బోవుచున్నారే.

4 వ గోప—మన కన్నము దొరకునట్లు నాకు నమ్మకము లేదు.

కృష్ణు—నీవూరకుండవుగా? మీకాఁకలిదీరు యోగమున్న యెడల దాని యంతట నదియే యన్నముఁదెచ్చి మీనోటఁ బడఁగలదు. అట్టి యోగము లేకున్న వీరావెంద్లకేల మీ యమ్మలుకూడ మీ కన్నము పెట్టరు.

4 వ గోప—అరుగో! మనవారు వట్టిచేతులతోడనే వచ్చుచున్నారు.

3 వ గోప—వెనుక పంపెద మనినారేమో?

4 వ గోప—గొల్లలమైన మనము కోరుటయు వారు పంపుటయుఁ గూడనా! మనవారి మూము మొగములు, తప్పటడుగులు చూచి నాకాశ లన్నియుఁ బోయినవి.

1 వ గోప—(ప్రవేశించి) కృష్ణా! "బ్రాహ్మణోత్తములు యజ్ఞములు చేయునప్పుడు గొల్లగాడెడల కన్నమా" అని మమ్మాఁ బారఁ దోలినారు. మమ్మ నిష్కారణముగాఁ బంపించిరి.

కృష్ణు—మీ రెవ్వరి నడిగినారు?

4 వ గోప—ఆ బాపనయ్యలనే.

కృష్ణు—ఈసారిపోయి యా బాపనమ్మల నడుగుఁడు. మీ కన్నము తప్పక పెట్టుదురు.

1 వ గోప—ఊఁ హుఁ! నావల్లకాదు. మగఁడు వద్దన్నఁ బెండ్లాము పెట్టునా?

కృష్ణు—పోనీ! నాపేరుచెప్పి యడుగుఁడు.

2 వ గోప—నీపేరు నీవేపోయి చెప్పుకొనుము.

కృష్ణు—ఓరీ! నేనీయుదయమున వృషభమును దోలిపెట్టినందునకై నఁ బోరాదా!

1 వ గోప—సరియే! ఈసారి వారు పెట్టకున్న మమ్ముల మాటలఁ బొమ్మనవుగా!

కృష్ణు—అట్లే పొమ్ము.

2, 1 గోప—(నిష్క్రమించుచున్నారు.)

కృష్ణు—ఓరీ! లోకములో నెంత గొప్పవానిదయ మనపై లేకున్నను వాని యాడువారి దయయున్నఁ జాలునని మీ రెఱుంగరు కాఁబోలును.

3 వ గోప—ఈసారి నీమాట నిజమగునట్లున్నదే కృష్ణా!

కృష్ణు—నామాట యెల్లప్పుడును నిజమే. ఆసత్యమైనను నిజమే. అదిగో! మనవారు పోయినతోడనే దానమిచ్చి లోనికిఁబోయి యన్నపుగుండలఁ దామే మోసి యిక్కడకుఁ దెచ్చుచున్నారు. చూచితిరా? ఈమాత్రము దయలేని యప్పఁడు వారి మగలెంత నిష్ఠతో నెన్ని తపస్సులు చేసిననేమి?

(ప్రవేశము—1, 2 గోపాలురు, వారివెంట నలుగురు విప్రకన్యలు అన్నపుఁ గుండలతో)

కృష్ణు—తల్లులారా! అడిగినది వెట్టిగొల్లలేగదా యని యావలకుఁ దోలక మృష్టాన్నంబుల దెచ్చుటయు, నందులో మీరలు గూని వచ్చుటచే మీకు వందనములు. బరువైన యీభాండముల

మోయుటచే అమ్మా! మీకరపల్లవంబు లెంత నొచ్చెనోకదా! మావారిచేఁ బంపకపోయిలిరా?

విప్రకన్య—కృష్ణా! చిన్నబిడ్డలగు మీరలడిగినప్పుడు అన్నముఁ దెచ్చుట యొక కష్టమేనా?

కృష్ణు—అమ్మలారా! మీహృదయములు దయారస పూరితములు. కావున నట్లనుచున్నారు. దయయేగదా సకల ధర్మములకు మూలకారణము. మరియు, నోతల్లీ! తనకు గలిగియు క్షుదార్తుని నిరాకరించుసంతటి పాతకమును, అన్నదానమంతటి మహా పుణ్యమును లేవుగదా!

చ. శ్వపచుఁడటంచు హీనకుల ♦ జాతుఁడటంచు క్షుదార్తునిన్ మదిన్
గృప విడియన్నమీయ కడి ♦ కించెను వారలు మేలుఁగాంతురే
తపముల నెన్ని జేసినను ♦ దప్పర నిష్ఫలదీక్షతోడనే
జపములఁ జేసినన్ వివిధ ♦ శాస్త్రచయంబుల నెన్ని నేర్చినన్.

1 వ విప్రకన్య—(తనవారితో) ఔనే! పడినా! చిత్రము. మొదట నీగోపబాలురను నిరాకరించినతోడనే యజ్ఞమాచరించు మన వారికి యాగ మంత్రములు స్మరణకు వచ్చుటమానె. అగ్నులు దీప్తిశగ్గెను. హోతలు కలవరపడఁ జొచ్చిరి. కాని మనము వీరికి అన్నభాండములతో వెడలిన తోడనే మఱల యజ్ఞకార్యము నిరభ్యంతరముగా కొనసాగ దొడఁగెను. ఆశ్చర్యము!

2 వ విప్రకన్య—ఆశ్చర్యమేమున్నది. అన్నమడిగిన వారిని నిరాకరించిన మనవారికి ధర్మసూత్రము తెలియుటకు యజ్ఞాధిపతియగు దైవము అట్లుచేసెను. ఇఁక పోవుదము రండు. నాయనలారా! మీఱు సావకాశముగా భుజింపుడు.

గొల్లలు—అమ్మా! నమస్కారము,

విప్రకన్య—(అన్నపుఁగుండలనిచ్చి నిష్క్రమింతురు):

1 వ గోప—ఏమోయి కృష్ణా! నీయూరాల యామువాండరు నిట్లు వినుటకుఁ గారణమేమి?

2 వ గోప—అక్కడకుఁబోయి మేము నీవేమి చెప్పినతోడనే యొకరి మొగమొకరు చూచుకొని లోలోన నవ్వుకొనుచు నట్టికుండల గిన్నెల నెత్తిని మోసికొని పరుగున వచ్చిరి. ఏవి! రేపువేఁబిలి చెడ. ఏమాత్రము వచ్చెనరో చూడు!

కృష్ణు—నాలోనేమున్నది? అనువారి స్వభావమట్టిది.

చ. మృదులములౌ స్వభావములు ♦ మెదిని వంతలఁ జూచపేసియా
హృదయపుమార్దవంబుఁ గల ♦ యింతులు "దేహి" యటన్నవానినే
యదనున భిక్షమీయకయె ♦ యాపలఁ దోలరు, వారి లట్టిరో
టువి యొకకారణంబు మగ ♦ లందఱు వారల నెమ్మి గోరఁగన్.

అంతటి దయాపరలు గావుననే పిల్లలఁ గనిపించుచుని వారిపాలఁ బడినది. మన మెప్పుడైన మందల నేమఱినప్పుడు కొట్టునది యయ్యలు బుజ్జగించునవి యమ్మలు గదా!

1 గోప—ఔను నీవన్నది నిజమే. మాయయ్య యొకనాడు దొడ్డున్న లూడఁ జెంపపైఁగొట్టగా మాయమ్మ నమలుట కిన్ని పేలాలు నోటిలోఁ గొట్టినది.

2 గోప—ఇదేమి? ఇప్పుడు బలరాముఁడు, నందుఁడు వచ్చుచున్నా రెందులకు?

కృష్ణు—ఇంకొక వేడుక జరుగనున్నది. గొప్పవేడుక!

1 గోప—ఏమది?

కృష్ణు—వీరింద్రయాగము చేయుటకు నాలోచింప వచ్చుచున్నారు. దేవలోకములో భోగ[illegible]యు ననుభవించు యింద్రునికి వేఱుగ యాగమెందులకు? యాగము మాన్పించి, యాగపదార్థములన్నియు మన వారలు కసుపు లెంపఁ దినుట కొప్పించెద జూడుఁడు.

ప్రవేశము—బలరాముఁడు; నందుఁడు.

నందు—కుమారా! ఇదేమి? ఈయున్నపుఁ గుండలు, ఈకూరముంతలు ఇవన్నియు నెక్కడివిరా!

కృష్ణు—నాయనా! ఈపొగ రెక్కిన వృషభము నావలకుఁ దోలి వీరు చాల నలసి యాఁకలి గొనిరి. కావున విప్రాంగనల నడిగి వీరి కింత భక్ష్యముల పెట్టించితిని.

బల—తమ్ముఁడా! అన్నిటిలో నీవేనా?

కృష్ణు—ఔనన్నా! అన్నిటిలో నేనే, నాతో నన్నియును. అదినాకు పుట్టుకతోడ నున్నపుడు వలదనినఁ దప్పునా?

నందు—కృష్ణా! నీ కెప్పుడును బెద్దవారితో నాటయే!

కృష్ణు—నాకున్నమాటయే పెద్దపెద్ద వారితో నాన్నా!

బల—అబ్బ! నీవు చాలఁ జతురుఁడవులెమ్ము. కాని తండ్రిగారేదిమో నీతోఁ జెప్పవచ్చిరి. నెమ్మదిగ వినుము.

కృష్ణు—(సంతోషపూర్వకముగా) నాయనా! ఏమది?

నందు—ఆ! మరేమియు లేదు. ఇంద్రయాగము చేయుదుము. రమ్ము.

కృష్ణు—(అనిష్టముగ) చేయింపుఁడు.

నందు—నిన్ను బిలుచుకొని పోవుటకు వచ్చితిని.

కృష్ణు—నిర్ణయించు పెద్దలు తాము. నేనెందుకు?

బల—నీవుకూడ లేని యేసంబరమునకు అమ్మ యియ్యకొనదు.

కృష్ణు—నేఁజేయుమనినఁ జేసెదరా?

నందు—ఆటంక మేమున్నది?

కృష్ణు—వలదనిన మానుదురా!

నందు, బలరా—(ఊరకుందురు.)

కృష్ణు—పోనీ. మనలో మనమాట. ఒకవేళ మఖము చేయుట మాని వేసిన నేమగునో?

నందు—ఆ! ఆ! ఎంతమాట! దేవరాజు కోపింపును. వర్షములు కురియవు.

కృష్ణ—ఇప్పుడీ యాగము చేయుటచే మీకేమైన వ్యయము ప్రయాసయు నున్నదా?

నందు—రెండును విశేషముగనే కలుగును.

కృష్ణ—ఎవ్వరయిన నిట్టిపని చేయుట, చేయకున్న నేరికో కోపము వచ్చునని యా? లేక దానివలన మనమేమైన లాభము నొందవచ్చునని యా? రెంటిలో నేది ముఖ్యము.

నందు—లాభము గలుగుటయే ముఖ్యము.

కృష్ణ—ఎవ్వరికయినఁ గోపము వచ్చునని కాదుకదా?

నందు—కాదు.

కృష్ణ—అట్టిలాభ మీపనిచేయకయే వచ్చుచుండ నిఁకనీయాపని చేయుట వ్యర్థముకునా!

నందు—అవును.

బల—లేనిపోని భారము తలపై వేసికొనుటకదా!

కృష్ణ—ఇట్టి యాగముచేసి యెన్ని యేండ్లాయెనది?

బల—ఎన్నో మాకు లెక్కా?

కృష్ణ—ఈసారి మానివేయుదము, మనకేమి యుపద్రవము గలుగునో చూచెదము.

నందు—ఈసారికి మాత్రము చేసిననేమి?

కృష్ణ—ఇఁకఁ బ్రతి పర్యాయము నీసారియే యందురు. నాయనా! మీకు సందేహమెందులకు?

ఉ. ధారుణి గొప్పకార్యములు ♦ దారతఁ జేయుట లాభమేదో చే
కూరు నటంచుఁగాక, మఱి ♦ గొంకక చాలధనంబు నెవ్వరే

నూరక పాఱఁబోయు టది ♦ యొప్పదు దుర్వ్యయ మౌను గాన ని
ష్కారణ మట్లుచేయుటలు ♦ గాంచిన విజ్ఞులు నింత సేయరే.

ఉ. కారణ మేదిలేక భువిఁ ♦ గార్య మదొక్కటి గల్గదింక నా
కారణకార్య నిర్ణయ మ ♦ ఖండ బలాఢ్యులైన దాఁటఁగా
నేరరు సృష్టిజాల మొకఁ ♦ డేమముఁదప్పి చరింప దెప్పుడున్
మీరొక రిట్లొనర్చుటలు ♦ మేలొకొ? తెన్నదలంచి చూడుఁడీ.

ఉ. ఇచ్ఛ తెఱంగు కారణ మొ ♦ కింతయు లేక చరించు నాజనున్
కిచ్ఛయటంచు బాలకులు ♦ పేరిడి నవ్వుచుఁ గేలిసేయుచో
సచ్చరిత ప్రభావులయి ♦ సర్వమెఱింగిన మీరె సేయఁగా
వచ్చునె! యూరిలోనఁ దల ♦ వంపుల నోర్చుచు నూరకుందురే.

బల—(కొంచెము కోపముతో) మాటలు చాలనేర్చితివని మేమెఱుఁగుదుము లెమ్ము. ఈయాగము మానుటచే నింద్రునికి గోపము వచ్చిన నీవడ్డు పడఁగలవా?

కృష్ణ—అన్నా! ఇంద్రునికిఁ గోపము వచ్చిన నేనడ్డుపడు విషయము తరువాత. కాని యాతనికిఁ గోపమువచ్చినను మనకేమి కొఱంత! స్వర్గమునకుఁ బోవలసినప్పుడుగదా మనకు వజ్రిభయము!

క. కోపింపనిమ్ము శక్రునిఁ
గోపించిన మనకదేమి ♦ కొఱంతవడును, స్వ
ర్గాపేక్ష నంత్యకాలము
ప్రాపించినవారు గారె ♦ భయ మందఁదగున్

అంతేకాక,

మ. సురనారీ జనలాలనంబుల గనున్ ♦ సోలింతలన్ నాకమం
దుఱు భోగంబులఁ గ్రిందుమీఁదెఱుఁగకే ♦ యుప్పొంగు దేవేంద్రుఁడీ
ధర నేమూలనొ వెట్టిగొల్లలు తనన్ ♦ దర్పించి యాగంబు సే
యుటటంచున్ గ్రహియించునే భయముతో ♦ నల్లాడ మీకేటికిన్.

బల—వర్షముఁ గురియింపకున్నఁ జాలదా!

కృష్ణు—ఓహో! తుచ్ఛకీదియా మీపందేహము? ఆభయము మీాకే మాత్రమును వలదు. వాన గురియుటలో దేవేంద్రుడేమి చేయఁ గలఁడు?

ఆ. వె. సంద్రమందు నీరు ♦ చండభానుని వేఁడి
దగుల నావిరిగను ♦ నెగసి దివిని
మేఘరూప మంది ♦ మేదిని వర్షించు
దీనిలోన నింద్రు ♦ తెలివి యేమి?

బలరా—ఖిల్లయిన నింద్రుని కీఁ దురాపహిట్టినియు, మేఘ వాహనుఁడని యుఁ బేళ్లెల కలిగినవి?

కృష్ణు—నేతిబీరకాయలో నేయి యేమాత్రమున్నదో?

బలరా—(నవ్వి) కృష్ణా! నీవు మాటలలో నతిచతురుఁడవు. నీతో వాదింపలేము గాని నీవీయాగము నెందులకు మాన్పింప నను కట్టితివో నాకుఁ దెల్పుము.

కృష్ణు—మిమ్ముల ననవసరమగు వ్యయమునుండి తప్పించుటకే! వేతే మి యున్నది?

నందు—ఆవ్యయము మిదివఱకే చేయబడినది. యాగ సంభారములన్నియు సిద్ధపఱుపఁబడినవి. ఇఁక నాగుట యెట్లు?

కృష్ణు—మఱియు మేలయ్యె. ఆసంభారములఁ దెప్పింపుఁడు. అవన్ని యు నాయింద్రుని మొగమునఁ బారఁబోయుటకు మారు మన మందఱ మిష్టమైన పిండివంటలఁ జేసికొని కడుపులార భుజింతము. బీదలకింత పెట్టుదము. బ్రాహ్మణులకు మంచి దానము లిత్తము. గోవుల కిష్టమైన ధాన్యరాసులఁ బోసి తినఁబెట్టుదము. లేఁగల కడుపులునిండ బాలు ద్రాగింతము. గొప్ప పండుగఁ జేసి కొందము.

బల—నీవేదియో చెప్పి యుబ్బించుచున్నావు. కాని యాగార్థముల నిట్లు దుర్వినియోగపఱుప వచ్చునా?

కృష్ణ—దుర్వినియోగమేమి? దేవరాజు పేరుచెప్పి మంటలోఁ బాఱఁ బోయుట సద్వినియోగమా? మనమును మన గొల్లలందఱునుఁ మఱియు ననేకులగు బీదవారును, విప్రులును, గోవులును, సంతోషించునట్లాచరించుట దుర్వినియోగమా? పలువురు తామొనర్చుదాని లాభనష్టముల నెఱుంగకుండ నెవ్వరోచేసిరిగదా యని తాముకూడఁ జేయుచు ననుకరణంబే యుత్తమధర్మముచే నెంతురు. కారణము లేకయే వింతగానున్న ప్రతివృక్షమునకుఁ బూజ! ఎత్తుగానున్న ప్రతివల్మీకమునకు బూజ! పనిలేక తనకేదియో దేవత యావేశించినదని వీధిలోఁగంతులువేయు ప్రత్యున్మాదికినిబూజ! అడవినుండి వచ్చిన ప్రతినక్కునకునుబూజ! దీనికిఁ బూజ! దానికిఁబూజ! ఎందునకది యంతయు? లోకమంతటిలో మనగొల్లలకే యిట్టి వెఱ్ఱి యూహలు చాలఁగ నావహించినవి. నామాట నాలకించి, మీరు యాగము నీసారికి మానుఁడు. ఇతరులును మనవలెనే మానుదురు. క్రమక్రమముగా మనకులమునకున్న పిచ్చి నమ్మకము లన్నియు వదలఁ గలవు. గొల్లలు సుఖించెదరు.

నంద—ముందెవ్వరయిన మానినచోఁ దరువాత మనము మానవచ్చును.

కృష్ణ—మనము చేయునది మంచిపనియైన యెడల మన మొకరి కొఱ కాఁగుటయెందులకు? యోచింపుఁడు. మీయాగసంభారముల నంతగా వ్యయపఱుపవలెనన్న నదిగో! ఆగట్టునకుఁ బెట్టుఁడు. దానిపై మనగోవులు చాలకాలము నుండి మేయుచున్నవి. కావున నట్లుచేయుట కృతజ్ఞతా సూచనంబుగ నుండు. అదియుఁగాక మనసంభారముల రసమంతయు భూమిలోఁగలయుటచే నాభూమిపై నిఁక బెరుఁగు కసవు, మఱియు మృదువుగను, రుచిగను నొత్తుగనుండును. ఆవులు బాగుగ మేయును.

బల—కృష్ణా! నీకెందుల కింతగట్టిపట్టు?

కృష్ణు—నాకేమియుఁ బట్టులేదు. నన్నడిగితిరి గావున నాకుఁ దోఁచి నట్లు చెప్పితిని. నామాటలు మీకు నచ్చకున్న, మీరు పోయి యాగముఁజేసికొనుఁడు. నేనురాను.

బల—(నందునితో) నాయనా! కృష్ణుఁడేకారణముననో నీయాగము కానీకుండవలెనని తలపెట్టియున్నాఁడు. అతని సమ్మతిలేక మన మది నెఱవేర్పలేమని నానమ్మకము. పోనిమ్ము. ఈసారి మాని వేయరాదా?

నందు—నాకును వానిమాటలు సకారణముగనే కన్పట్టుచున్నవి. అది యుఁగాక యీయాగవ్యయము చాల నధికముగ నుంటచే నది మనము భరింపలేనిదై యున్నది. కావున నీపైన నది తప్పించు కొనవలెనని నాకును దోఁచుచున్నది.

బల—కృష్ణా? నీవంతగాఁ జెప్పడానిని మేము మాత్రము నిరాకరింతు మా! కాని గ్రామములోని తక్కిన గొల్లలను గూడ విచా రించిగాని యిది మానరాదు. కావున నీవుకూడమాతోరమ్ము. వారితోఁగూడఁ జేరి యాలోచింతము.

నందు—ఔనది నిజమే. అట్లుచేయవచ్చును.

కృష్ణు—మేలుమేలు. నావిన్నపమును మీరాలింతురనియే యింతదూ రముచెప్పితిని. సరియే. పోదమురండు. గోపకులారా! మరల నిప్పుడే వచ్చి కలసికొందును. లేకున్న మీమందలతో బాటు నామందనుగూడ వ్రేపల్లెకుఁ దోలికొనిరండు. నామందసంఖ్య యెఱుగుదురు గా?

1 గోప—ఎఱుఁగుదుము. అట్లే తోలితెచ్చెదములెమ్ము.

(నిష్క్రమింతురు.)





శ్రీ ర స్తు.

శ్రీశోభనాద్రీశ్వరోవిజయతామ్.

శుభమస్తు.

# గోవర్ధనోద్ధారణము.

## ద్వితీయాంకము.

దేవలోకము—దేవేంద్రునిసభ.

ప్రవేశము—దేవరాజు, బృహస్పతి.

దేవేంద్రు—గురువర్యా! నాకు నేఁడేమో చాల విసుఁగుగా నున్నది. మదిలో నేమియుఁ దోచుటలేదు,

బృహ—చాలకాలమేపనియు లేకుండుటచే నట్లున్నది కాఁబోలు.

దేవేం—పనిలేకేమి? ఐరావతమునెక్కి యూరంతయుఁ బరిక్రమించితిని. తరువాత గంధర్వాంగనలచేత సంగీతము విని కొంతకాలముఁ గడపితిని. దేవా! ఏమాలోచించుచున్నారు?

బృహ—ఏమియులేదు. నీవిసుఁగుఁదల యెట్లు మానునాయని యాలోచించుచున్నాను,

దేవేం—అప్సరోంగనలఁ బిలిపించి నాట్యము చేయుమందునా? ఔనది బాగుగానున్నది. ఓరీ! ద్వారపాలకా!

- ప్రవేశము—ద్వారపాలకుఁడు.

దేవేం—నాట్యము చేయ సంసిద్ధలైన యప్సర స్త్రీలను ద్వారగారమ్మనుము.

ద్వార—చిత్తము. (నిష్క్రమించును.)

బృహ—(తసలో) ఈతనిబుద్ధి యెప్పుడును విషయలంపటమై వర్తించుచున్నదిగదా! మార్పఁజూచెదనా? ఏమో? ఏమికోపమువచ్చునో? ఐనను గురుఁడనుగదా! చెప్పిచూచెద.

దేవే—ఏమట్లూరకాలోచించుచున్నారు?

బృహ—ఆ! వేళయైనున్నది? ఇదిగో! చూడుము. అప్సరలతో నాపైని నాట్యము చేయవచ్చు—కాదు. కాదు. చేయించ వచ్చును. కాని ముందేదైనఁ గొంచెముగాఁ బుణ్య గ్రంథమును జదివి కాలక్షేపముచేసిన బాగుగ నుండునేమో!

దేవేం—మీరింత తలపోసి తుదకిదియా నాకుఁ జెప్పవచ్చినది? ఏదియో పాతపుస్తకమును జదివికొనుచుఁ గూర్చుండుట, వయసు మీరిన మీబోఁటి వృద్ధులకుఁ దగినదికాని; సకల సౌఖ్యముల ననుభవింపఁ దగిన మాకుఁ దగినదికాదు అదియుఁగాక నేనిదివఱకుఁ జదివిచూడని గ్రంథములేవి యున్నవి?

బృహ—ఇదివఱకుఁ జదివియున్నను జ్ఞప్తిలేనిదానిని, జ్ఞాన బోధకముగానున్నదానిని, లేక విష్ణుకథల—

(అప్సరసలు ప్రవేశించి నమస్కరింతురు.)

దేవేం—గురువరా! ఆఁగుము. అప్సరోంగనలారా! మీశక్తికొలఁది నాట్యమాడి మమ్ము సంతోషపెట్టుఁడు.

అప్స—దివ్యాజ్ఞ ననువర్తింతుము. (నాట్యము సల్పుదురు.)

దేవేం—గురువరా! అందఱిలో నూర్వశియే బాగుగ నాట్యముచేయుచున్నదిసుమా! మీరు దేని నాట్యము బాగుగనున్నదో పరీక్షించి చెప్పుఁడు.

బృహ—అడవిలో కుఱ్ఱలకుఁ జదువుచెప్పుకొను నాకీ విషయమేమి తెలియును. (లేచి) రాజా! నాకు వేళయైనది. సెలవిచ్చిన—

దేవేం—(కూర్చుండబెట్టి) వేళయైనఁ దరువాతఁ బ్రాయశ్చిత్తము చేసికొనవచ్చును లెండు. తాము లేకున్న నాకేమియుఁ దోచక పిచ్చిపట్టును.

బృహ—వీరలున్నారుగా?

దేవేం—వారినైన నాకేమియు సంతోషము కలుగలేదు. నేనెప్పుడును జూచుచున్న నాట్యమేగదా?

బృహ—(తనలో) ఈబుద్ధియే మొదట నుండఁగూడదా?

దేవేం—అప్సరలారా! మీరిఁక నాట్యము చాలించిపొండు.

అప్సరసలు—అనుగ్రహింపఁ బడితిమి.

(అప్సరసలు యింద్రునకు మ్రొక్కి నిష్క్రమించుచున్నారు.)

ప్రవేశము—ద్వారపాలకుఁడు.

ద్వార—(తనలో) మారాజుగారేమొ కోపముతో నున్నారు.

దేవేం—ఓరీ! వచ్చి తెల్లమొగముతో నావంకఁజూచెదవేమి? ఉన్నదేమో త్వరగా వెళ్ళగక్కి పోరాదా?

ద్వార—దేవా! యాగసంభారములఁ గొనివచ్చు చారులువచ్చినారు.

దేవేం—చారులు! గీరులు! అంధులకు నన్నుఁజూచుట కిదేసమయమా! వీలుగాదు పొమ్మనుము.

ద్వార—(పోఁబోవఁగా)

దేవేం—ఓరీ! ఏమి! మాటవినకయే [illegible] పరుగెత్తెద వెక్కడకు? వారల రమ్మనుము.

ద్వార—(నిష్క్రమించును.)

దేవేం—దేవా! యాగమునిన జ్ఞాపకమునకు వచ్చినది. భూలోకమున రాక్షసబల మధిక మగుటచేత మనకు యాగ సంభారములే వచ్చుటలేదుగదా!

బృహ—కొలఁది కాలములోనే మనకష్టము లన్నియుఁ గడతేఱును లెమ్ము.

దేవేం—(విసుగుతో) ఎట్లు కడతేఱును? నీవలననా? నావలననా? మన భటులందఱుఁ బిఱికిపందలై, రాక్షసనామము వినునంతనే పునరాలోచనలేక తిరోహితులగుచుందురు.

బృహ—(తనలో) తానుమాత్రమేల రాక్షసులను బొలియింపరాదో! (ప్రకాశముగా) అన్నియుఁ ద్వరలో సరిపడునులెమ్ము.

దేవేం—ఏమి సరిపడును? అసురుల వలనఁ బ్రహారములు మనకు సరిపడునా?

బృహ—కాదు. ఆనాఁడు నీవును, నేనును, బ్రహ్మయు వైకుంఠమున కేగి యిందిరానాధునితో మన బాధలఁగూర్చి మనవిచేసికొనఁగా, భూమినవతరించి, మనబాధల నివారింపఁజేయుదునని వాగ్దానమిచ్చి యుండెనుగదా!

దేవేం—వాగ్దానమిచ్చుటకేమి? వైకుంఠమునఁ విశ్రాంతిగ నుండక మనకొఱకై భూమిలోఁ బుట్టుట కాతనికేమి తొందరవచ్చినది? ఆయనచెప్పినట్లు మన దేవకాంతలఁ జాలమందిని మనకులేకుండ భూమిలోఁ బుట్టఁ బంపితిమిగదా! వారలెక్కడఁ బుట్టిరో యేమైరో? మనకుఁ దెలియులేదు, ఇంతకు విష్ణువు అవతరించినట్లు, మనకు వార్త రానేలేదు,

బృహ—అవతరించెనో, అవతరించునో, అల్పజ్ఞులగు మనకు శ్రీహరి లీలాచర్య [illegible]పై గాఁక సులభముగ బోధపడువచ్చునా!

దేవేం—అవతరించునా? ఎక్కడు? నిన్నుఁబోలిన బృహస్పతులొక కోటి మందియు, [illegible] దేవేంద్రు లొక లక్ష[illegible], నిక్కముగ

బ్రహ్మాయువుబోలిన బ్రహ్మ లోకవేయిమందియుఁ బుట్టి చచ్చినపిమ్మట నెన్ని యుగములకో—ఎన్ని కల్పములకో—యవతరించును. నీమాటలకేమి?

ప్రవేశము—భటుఁడు.

దేవేం—ఓరీ! మన్నుతినిన పాములవలె నిట్లు నెమ్మదిగా నడచెదరేమి? ఏమివిశేషములు? త్వరగాఁ జెప్పుము.

భటు—దేవనాథా! భూలోకమున రాక్షసుల బాధల వలన యాగ సంభారము లెక్కడను దొరకలేదు.

దేవేం—అది మన కెప్పుడు నున్నకర్మమేగదా! క్రొత్తసంగతులేమి?

భటు—శూరసేనరాజ్యంబున వ్రేపల్లెలోని యాదవులు దేవరపేర యాగ మప్పుడప్పుడు చేయుచుందురట వారుకరవైయున్నది.

దేవేం—ఔను. కాని వారును జాలకాలము నుండి చేయరైరిగా! నేననిన వారికిఁగూడ నిర్లక్ష్యము కాఁబోలు?

ఉ. ఏదియొమూలఁగాఅడవి ♦ నెంతయుఁ గుమ్మరికష్టమందుచున్
యాదవులాలమందలను ♦ నట్టిటుమేపుచు, జీవనంబులే
మేదినిసాగఁజేయుటకు ♦ మిక్కిలిఁ గుందుదురంచు నింకనే
నాదరరీతినుంటి నిను ♦ మంతయుజాగికనీూఁద సైతునే.

ఐన నేమి? ఇప్పుడైనఁ దెలివిగాంచిరికదా! ఏవీయాగసంభారములు? వానిని బరీక్షించుచునైనఁ బ్రొద్దుపుత్తము. గురువరా! సంధ్యావందనకాలమైనను నిన్నిందాఁపి ప్రాయశ్చిత్తమునకు లోఁజేసినందులకై వీరలు తెచ్చినవన్నియు మీకిచ్చెద.

భటు—దేవా! లేవు.

దేవేం—ఏమిలేవు?

భటు—యాగసంభారములు.

దేవేం—ఓరీ! వానిని మీరుదారిలో దొంగిలించితిరి కాఁబోలును? మి
మ్మీపట్ల క్షమింపను.

భటు—స్వామీ!

దేవేం—స్వామియు లేదు. గీమియు లేదు. ఓరీ! ద్వారపాలకా! ఈదు
ర్మార్గుల నైరావతముచేఁ ద్రొక్కింపుమనుము.

భటు—స్వామీ! మామొఱశాంతముగా నాలకింపవలెను.

దేవేం—ఆలకించుటకేమున్నది?

భటు—వారాయాగము నీసారిచేయలేదు.

దేవేం—చేయనిదే యాయాగప్రశంస యెందుకుఁ దెచ్చితిరి. నన్నూ
రక యువ్విళ్ళూరించుటకా?

భటు—మామనవి యొకింత శాంతముగా నాలకింపవలెను.

దేవేం—శాంతముగా నాలకింపకుండుటకు నేను ముంగోపినా? నా
యందీదోషమెప్పుడు కనిపెట్టితిరి?

భటు—దేవరయాజ్ఞకు బాత్రులము.

దేవేం—కానిండు. చెప్పవలసినది త్వరగాఁ జెప్పుఁడు.

భటు—వారీసారికూడ యాగముచేయుటకు సర్వమును సిద్ధము చేయు
చుండిరని విని మేమాస్థలమునకుఁ బోయితిమి.

దేవేం—ఏమైనది?

భటు—వారాయాగమును జేయలేదు.

దేవేం—మఱియేమిచేసిరి?

భటు—తెచ్చిన పదార్థములన్నియు తమ పేరున నాహుతిసేయకయే,
వారే తినివేసిరి.

దేవేం—ఆ! నిజముగనే...

భటు—నిశ్చయముగ.

దేవేం——(ఉగ్రుఁడయి) ఓరీ! గొల్లలారా! నాపేరునఁదెచ్చిన పదార్థములు మీరనుభవించితిరిగా! ఏమికండకావరము?

ఉ. పాలును పెర్గు మీఁగడలుఁ ♦ బల్మరుబొజ్జలనిండమ్రింగి తేం
కాలము నాలనెంటఁజని ♦ కర్షణకెట్టి శ్రమంబులేమిచే
జాలఁగఁ గొవ్వి గొల్లలతి ♦ సాహసులై త్రిదశాధినాథులన్
దేలికఁజేసియాహుతికి ♦ దెచ్చిన ద్రవ్యములన్ హరించిరే.

వీరలకు, వీరిగోగణంబులకు నాదిపోషకుఁడ నేనని యెఱుఁగరు కాఁబోలును? నాకాగ్రహమువచ్చినఁ దుచ్ఛులగువీరెంత! వీరిగోగణ మెంత! రెండేండ్లు మేఘముల వర్షము గుఱియవద్దనినఁ జాలదా?

క. గోవులను మేపుచోటుల
నే వర్షము గుఱియఁబోవ ♦ నీకుండిన వా
రావులతో నైశంబే
చావరె యెందునను దిండి ♦ సమకూడమిచేన్.

బృహ——వారలెందుచకు యాగము మానిరి?

దేవేం——ఎందుసకు మానిన మనకేమి? మానిరి వారి గర్వమడఁచుటకు మనకది చాలును.

బృహ——ఇంద్రా! క్షమించి నామాట వినుఁడు. వారేదియో యవిలంఘనీయమగు నవసరము లేనిదే యూరక మఖము మానుదురా?

దేవేం——వారిపొట్టలఁ బోసికొనుటకంటె వేఱొక యవసర మేమున్నది? భటులారా! వారు మానుట కంతకంటె నేమైనఁ గారణమున్నదా?

భటు——ఉన్నది. అది తెలిసికొనుటకే యింత తడవైనది. వ్రేపల్లెలో గొల్లలందఱు దేవరపేర యాగము చేయుటకు సంసిద్ధులయియుండగా, నందుఁడను నొక పెద్దకుఁ గొడుకైన కృష్ణుఁడను బాలుఁడు వారికేదేదియో బోధించి వారల నివారించెనఁట!

దేవేం—ఆబాలుఁడు మాన్పించెనా? ఉన్నదియున్నట్లు చెప్పుచున్నావా? లేక సోమ మధికముగాఁ బానముచేసి నీనోటికొలఁదిఁ బేలుచున్నాఁడవా? జాగ్రత్త!

భటు—దేవా! నిజస్థితినుండి వీసమంతయిన నేవేఱుగఁ బల్కుటలేము. ఆ బాలుఁడు చాలఁ జిన్నవాఁడెయట!

దేవేం—ఆబుడుతను చెప్పిన వారుమానిరా? గొల్లలకేమైనఁ బిచ్చిపట్టి నదా? ఆబాలుఁడు వారితో నేమని చెప్పెను?

భటు—అతఁడు వారితోఁ బల్కినమాటలు మేము తెలిసికొన జాలమైతిమి. కాని యాతఁడు వక్కాణించిన ముఖ్యాంశములు కనుఁగొంటిమి.

దేవేం—ఏమవి?

భటు—"మనకు వర్షములు కురియుటలో దేవనాథుని సాహాయ్య మేమియు లేదనియు, వర్షము నైసర్గికముగాఁ దనంతఁ దాఁగురియక మానదనియుఁ గావున దేవనాథునకు మఖము చేయించుట వృథావ్యయమనియు" బోధించెనఁట.

దేవేం—ఎట్లూ? కండకావరపుమాట లన్నియు నాబుడుతని నోటివెంట వచ్చినవే? వాఁడెట్టి వాఁడు?

భటు—అతనిఁ జూడకుండుటచే వాఁడెట్టివాఁడో మేమెఱుఁగము. కాని యాతఁడెవ్వరిమాటయును వినక యెప్పుడును పలుగాకి పనులు చేయుచుండు నని మాత్రము వింటిమి. మఱియు యాదవులందఱకు నాతఁడనినఁ జాలభయమును గౌరవమును గూడనఁట!

దేవేం—వాఁడెట్టి వాఁడయిన మనకేమి? మనయెడల నగౌరవముఁజూపి యుండుటచే వారిని దప్పక శిక్షింపవలెను.

భటు—మేమెఱిఁగిన విషయము లందేదియు దేవరకడ దాఁపరాదు. నాబాలుఁడు గొల్లలకొక కొండనుఁ జూపి ఈ కొండపై మన యావులు మేయుచుండుటచే దేవనాథునికంటె నీకొండయే

మనకుఁ జాలనుపకారిగానున్నది. కావున మీ పూజలన్నియు నిఁక నీకొండకుఁ జేయుఁడని పురికొల్పెనఁట!

దేవేం—(కోపముతో) ఓరీ! పొగరఁబోతా! నన్నింతగా నెగ్గాడితివా? ఇఁక నీపని పట్టితీఱెదను. ఆకుఱ్ఱఁడు చెప్పినట్లా గొల్లలాకొండకుఁ బూజచేసిరా!

భటు—ఇంకను జేయలేదు. నేఁడో, రేపో చేయఁబోవుచున్నారు.

దేవేం—ఏమీ! తుచ్ఛులగు మానవుల కింత యదరిపాటా? ఇంత నిర్లక్ష్యమా?

క. పుట్టినదాది జరామృతి
నెట్టనఁబై వచ్చుదేహ ♦ నిచయంబులతో
మిట్టిపడుటేల వీరలు
మట్టించెద వీరినపుడు ♦ మనుచు నెవండో?

ఎట్లు? చూచెదఁగాక! ఓరీబాలకా! దేవేంద్రునికివచ్చు నాగ్రహము, నీవేదియో దుండగము చేసినప్పుడు నీపై వచ్చిన నీజనని కోపము వలెఁ జల్లారునది కాదుసుమా?

తే. గీ. పుల్లతో నావుతోఁకపై ♦ బొడుచుకొనుచు
"చ్చో, చ్చో, చో" యటంచు మునుపీవు ♦ పెచ్చుపెరిగి
దేవనాథునికెదురుగాఁ ♦ దిరిగినావె?
పురుగు పెద్దమంటలపైకిఁ ♦ బోవునటులు.

వర్షములఁ బట్టుమని యొక రెండేఁడు లాఁపితినా మీగోవులు మేయుటకు గడ్డిపోచలేకుండును. అప్పుడు నీకడుపునింపుకొనుటకు వాని చన్నులలోఁ బాలులేక, నీవు కొన్నినాళ్లాకలితో మలమల మాడినఁ గాని నీయొడలికొవ్వు కరఁగదు. తలపొగరు తగ్గదు. దేవనాథుఁడన నెవరనుకొంటివో? ఓరీ! భటులారా! మేఘదేవతలఁ బిలిచికొనిరండు.

భటు—(నిష్క్రమింతురు.)

బృహ—(తనలో) నేఁడీతని కేలొకో తగినకారణము లేకయే, కోపము తిశయముగా వచ్చుచున్నదిః ఈతనివైఖరిచూడ నీతనికిఁ గొలఁదికాలములోనే యేదియో సంకటము వచ్చునట్లున్నది.

తే. గీ. తగినకతమింతలేకయే ♦ మిగులజనుఁడు
కోప, చింతాభయంబులఁ ♦ గూడియున్న
వాని పర్యవసానంబు ♦ లైన వెతలు
కొలఁదికాలంబులోనె రాఁ ♦ గలవు నిజము.

(ప్రకాశముగా) రాజా! పిల్లవాఁడువద్దనిన యాశవులందఱొక్కసారిగ నీమఖము మానుదురా? వింతగానున్నది.

దేవేం—వింతయగుగాక! వారు మనల ధిక్కరించుట గొప్పనేరమందురా? కాదా?

బృహ—వారుచేసినది గొప్పనేరమే! చాల గొప్పనేరము. కాని యా పిల్లవాఁడు బోధించుటేమి? పెద్దవారు వినుటయేమి? చూడగా నేదియో వింతగానున్నది. ఇదిగో! చూడుము. మనమందఱకును మనపిల్లల—మనకుఁ బిల్లలులేరుగా—లోకములో సాధారణముగాఁ బెద్దవారిబోధనలు చిన్నలువినుట సహజము. ఒకవేళ నేకుఱ్ఱఁడైనఁ బెద్దలకెదురాడిన రెండుతాడనము లొసర్చి వానికి బుద్ధితనిమాటపై వర్తించుటయా?

దేవేం—కనులకుఁ బొగరెక్కి కండకావరమున మతులుచెడినవారందఱివలె సత్పథమునఁ జరింతురా?

బృహ—అటుకాదు. దీనిలో నేదియోవిశేషమున్నది. ఇప్పుడు మీరు వర్షము మాన్పించినను వర్షములేమిచే వారికి బాధ కొంతకాలమునకుఁగాని కలుగదుగదా? కొంతకాల మాఁగి దీనియుదంతమంతయు బాగుగ నెఱిఁగిన తరువాత నేకార్యమునకుఁగడఁగిన నేమిబాధ యున్నది? తొందరపడిన నేదైన హాని చేయుదుమో?

ఒక్కనిపై కోపించి వర్షముల మాన్పిన యెడల లోకమున కంత టికిని హాని కలుగునుకదా? ఎలుకను సంహరించుటకు యిల్లు కాల్చుటయను సామెత భూలోకమున నున్నది.

దేనేం—కావున తమయుద్దేశమేమి?

బృహా—వీరు యింద్రయాగము సలుపకున్న నేమి! మనకాహుతినిచ్చు వారెందఱు లోకములలో లేరు?

దేవేం—మీరు ఎప్పుడు మమ్ము విక్రమింపనీక, యిట్లేనివారించుచుం దురు. దానవులఁ జూడుడు. వారి మానసేచ్ఛలే నీతులుగను, వారి సౌకర్యములే ధర్మములుగను, విజ్రువీఁగుచున్నారు గాని నీబోటి ముసలి మూల్గులనే వేదమంత్రములుగాఁ బాటించుచు న్నారా? హిరణ్యగర్భుండును, ఫాలనేత్రుఁడును, వారికిఁబ్రత్య క్షమై వారికి వరములిచ్చుచున్నారు గాని మన దేవతలకేమైన నిచ్చుచున్నారా? విష్ణువంతటివాఁ డవతారములెత్తుట వారికొ ఱకా నాకొఱకా? తుదకోడి చచ్చినఁ జచ్చిరిగాక! మనదేవత లలో నొక్కఁడైనను హిరణ్యకశ్యపుని యంత కీర్తి గడించెనా? రావణునియంత శౌర్యముంగాంచెనా? ఇప్పుడు భూలోకమునఁ దేజరిల్లు శిశుపాలునియంతపేరైనఁ బొందెనా? ఎందువలన వా రలకును మనవారికి నింత తారతమ్య మున్నది. మనవారలెట్లు పోయిన నేమివచ్చునోయని వెనుకాడుట చేతను, వారు వీరు లై విచ్చలవిడిగ వర్తించుటచేతను—సాహసమే యన్నిఁటికిని బ్రధానము. కావున నన్నిందుండి నిరుత్సాహపఱుపకుఁడు.

బృహా—(తనలో) ఓహో! రసము ముదురు చున్నది. ఈముంగోప మితని నూరక పోనీయదు. ఐన నింకొకసారి చెప్పిచూచెద. (ప్రకాశముగా) రాజా! నీమేలుగోరువాఁడ నగు నామాట నింత యాలింపుము.

సీ. దేవేంద్ర! నీమేలు • దినదినంబునుగోరు
గురునిమాటకు కిన్క • గొనకుమయ్య
గొప్పవారలకైనఁ • గొలఁదికార్యంబైన
నూహించి యొనరించు • టొప్పునయ్య
కోపంబుమదిఁబూని • పాపపుణ్యంబుల
దెలియ కెవ్వరికెగ్గు • దలపకయ్య
చిన్నబాలుఁడుగాన • శిక్షింతుమనలీల
ననినమ్మి వానిపైఁ • జనకుమయ్య
తే. గీ. గొల్లకుఱ్ఱఁ డల్పుచేయుంట • కల్లయయ్య
యేనతని నొక మిన్నగా • నెంతునయ్య
యెట్టిపుట్టలో నేపాము • యెఱుఁగమయ్య
యాతురతమాని లెస్సగా • నరయుమయ్య.

దేవేం—ఆవెఱ్ఱిగొల్లలు మమ్ము ధిక్కరింపఁగలరా?

బృహ—ధిక్కరింపఁజాలరను కొనుము. ఐనను గొంచెమాఁగి సంగతుల నెఱుఁగుదుము. ఒకవేళ నీవిప్పుడు వర్షమునిలిపినను కాలమునకుఁగాని వానికి బాధగలుగదు.

దేవేం—అట్లేని వారి గర్వప్రహరణము చేయుటకొక విధము గలదు. అనావృష్టివలన బాధ కొంతకాలమునకుగాని మానవులకుఁ దోఁపదు. అతివృష్టివలని సంకటము అప్పుడే తెలిసివచ్చును. హే! మేఘదేవతలు రారో?

మే. దేవ—(ప్రవేశించి) స్వామీ! ఏమిసెలవు?

దేవేం—మీరీక్షణమే మీమీ మేఘ జాలములతో - ఏవి? ప్రళయ కాలమున వెడలు మేఘములన్నిఁటితో భూలోకమున వ్రేపల్లె యను గ్రామంబుపై కేగి యాపల్లెయు నాపరిసరప్రదేశములన్నియును నాలుగైరావతములంత లోతుగల జలార్ణవమగునట్లుగ

నుఱుములతోఁ, బిడుగులతో, మెఱుపులతో, హిమ శిలా వృష్టిగురిసి యాప్రదేశమునంతను నాశము చేయవలెను. అట్లు చేసి వచ్చితిరేని మీరు కోరుకొనినవెల్ల నిచ్చి సంతోష పెట్టువాఁడ. నేనుఁగూడ నైరావతమునెక్కి మీవెంటవచ్చెద. బృహస్పతీ! తామింక అశ్రమంబునకు విచ్చేయుఁడు.

(నిష్క్రమించును.)

బృహ—ఆహా! ఎంతవాఁడయిన నేమి:

ఉ. కాలము దాపురించుతఱిఁ ♦ గాంచఁడు మేలునుకీడుఁగాని, తా
మోహిలసేవంతుస్వాయమగు ♦ ముచ్చటయొక్కటిచెప్పఁజూచినన్
గాలునియట్టు లుగ్రుఁడయి ♦ కట్టడియైకనుఁదిట్టు, వానికిన్
బోలిఁశిక్షయగాదనుక ♦ బుద్ధియుఁగల్గదు కాలవక్రతా
లీలనెదుర్కొనం జనఁగ ♦ లేఁడు విధాతయు వానితోతయున్.

(నిష్క్రమింతురు.)





శ్రీ ర స్తు.

శ్రీశోభనాద్రీశ్వరో విజయతామ్.

శుభమస్తు.

# గోవర్ధనోద్ధారణము.



## తృతీయాంకము.

గోవర్ధనగిరిప్రాంతభూమి.

ప్రవేశము—కృష్ణుడు; 1, 2, 3, 4 గొల్లలు. కొందఱుగోపికలు.

గోపిక—ఏమికృష్ణా! నీపట్టుదల! ముసలివారిసందఱను నీమాట చాతుర్యంబున నీదారికిఁ ద్రిప్పి, దేవేంద్రునిపేరఁ బెట్టవలసిన యాగసంభారముల నీగట్టునకుఁ బెట్టించుచున్నావు!

కృష్ణ—పెట్టుటకదా కావలసినది; ఇఁక నెవ్వరిపేరఁ బెట్టిననేమి? అన్నియుఁ దుదకొకస్థలమునకే పోవునుగదా!

తే. గీ. ఏరికిచ్చినసోమవి ♦ యెల్లఁదుదకు
దైవసంప్రీతి కరములై ♦ తనరుచుండు
నీరమేనదిలోఁబడి ♦ పాఱుచున్నఁ
గడకు సాగరంబునుజేరి ♦ కలియుఁగాదె!

2 గోప—కృష్ణా! అదిగో చూడుము. నీవుచెప్పినప్రకారము మన మం దలన్నియు గొండచుట్టు నెల్లప్రదక్షిణము చేయుచున్నవో.

కృష్ణు—అవును! ఆహా! వానియందము చూడుము.

సీ. సొగసైన నడకతో ♦ సుందరాకృతితోడఁ
గోమలాంగులఁబోలు ♦ గోవులవిగో!
తల్లియావులచుట్టుఁ ♦ దాండవంబొనరించి
ముద్దులొల్కెడిలేఁగ ♦ మూఁకలవిగో!
పెద్దఱంకెలతోడ ♦ పెనుమూపురములతో
బుసపెట్టిచనెడి నాఁ ♦ బోతులవిగో!
వడియైన నట్టులు ♦ నసివాఱుగిత్తలు
రాజిల్లిలాగు గో ♦ రథములవిగో!

తే. గీ. అమలపాయసంబుల నిండి ♦ నట్టికుక్షి
చయముతో నొప్పుగోపాల ♦ సంఘమదిగో!
చలిత తనుమధ్యవిలసన ♦ సన్మరాళ
గమనమునసేగు గోపికా ♦ కాంతలరుగో!

బల—చూచితిరా! ఆయుత్సవ మంతయు నెంతసంతోష కరముగా గిరిప్రదక్షిణముచేసి పల్లెలకుఁ బోవుచున్నదో.

3 వ గోప—ఆహా! బొజ్జనిండ తియ్యని వంటల భుజించితిమి. చల్ల గాలిహాయిగా నున్నది. ఈపచ్చిక పట్టుల పండుకొని హాయి గా కథలుచెప్పుకొందము.

(అందఱు పరుండుదురు.)

1 వ గోపిక—చిన్నికృష్ణా! నేనుపాయసము బాగున్నదా! లేక పర మాన్నమా!

కృష్ణు—నీవేదివడ్డించితివి?

1 వ గోపిక—పాయసమే;

కృష్ణు—అదేబాగున్నది.

1 వ గోపిక—కాదు. మఱచితిని. నేనువడ్డించినది పరమాన్నమే.

కృష్ణు—ఔనే! జ్ఞప్తికివచ్చినది. అదే రుచిగానున్నది.

1 వ గోపిక—కల్లలమారి పిల్లడా! నేనేదివడ్డింపలేదు.

కృష్ణు—కావుననే కంమును నాకురుచింపలేదు.

2 వ గోపిక—ఆ! ఏమీ! వడ్డించినదినేను.

కృష్ణు—ఓహో! అట్లనట్లే! కావుననే కడుపునిండ జుఱ్ఱితిని. మా అన్నయ్యనడుగుము.

బలరా—ఓయిబాబు! నాకు మాటాడుట కోపికలేదు. నిద్రవచ్చుచున్నది.

నందు—అవును. కడుపునిండ దినిననాడు విశేషముగ మాటాడకూడదు.

1 వ గొల్ల—కొంచెముసేపు నిద్రబోవుదము.

అందఱు—అవును. అవును. అట్టిట్టు పొరలి కొంచెము కన్నుమూసిన గాని ఆయాసము తీరదు.

అందఱు—అవును. ఆ! ఆ! (అని ఆవులించుచు గుఱ్ఱుపెట్టి నిద్రింతురు)

(ఉఱుములు; మెఱుపులు.)

కృష్ణు—అన్నా! లెండు. లెండు. గాలివాన వచ్చుచున్నది.

(అందఱు మేల్కొందురు.)

1 గోప—ఇప్పుడేగదా! కన్ను మూసికొన్నాము. ఆఁ! ఆ! (ఆవులించును.)

2 గోప—అప్పుడే యీమబ్బులన్నియు నాకాశము నిండినవేమి?

3 గోప—ఇంతనల్లని మబ్బుల నెన్నఁడును చూడలేదు. రాత్రివలెఁ జీఁకట్లు క్రమ్ముకొని వచ్చుచున్నవి.

కృష్ణు—మబ్బు క్రమ్ముకొనినప్పుడు చీఁకట్లు పడకుండునా? మీ కెందు నకీవింత?

1 గోప—అరెరే! ఆపెను గాలి యప్పుడే ఇక్కడకు వచ్చినది.

కృష్ణు—(చప్పటులఁగొట్టి నవ్వుచు) ఓ హో హో! అటు చూడుఁడీ? గోపికల కేశబంధములు ముడివీడఁ దుమ్మెదల చాలువలె గాలి కెల్లెగురు చున్నవో?

1 గోప—కృష్ణా! నీ కెప్పుడు గోపికల మెచ్చుకొను సంబరమేనా?

కృష్ణు—ఇప్పుడంతకంటె నుపద్రవ మేమివచ్చినది?

1 గోప—ఏమివచ్చినదా? అబ్బ! ఈగాలి యెంతచల్లఁగా నున్నది? నడిసీతువునందుఁ గూడ నింత చల్లదవము లేదే! దౌడలాడు చున్నవి.

2 గోప—(వణఁకుచు) మండువేసవి కదాయని, కప్పుకొను కంబళుల నైనఁ దెచ్చుకొనలేదు.

౯ వ గోప—అంజలిమీఁచెట్టు మొదటి కేఁగుదము రండు. (లోపల నేదియో విఱిగినధ్వని యగును) అమ్మయొ్య! అంత పెద్దచెట్టే విఱిగినదే. ఏమి యీగాలి బలము!

1 గోప—మనము దానిక్రిందకుఁ బోయిన తరువాత విఱుగక ముందు గనే విఱిగినందునకు దానికొక దండము పెట్టుము. (లోపల నుఱుము మెఱుపులపడి) అయ్యయొ్య! ఈ గాలితోఁబాటు వాన కూడనా! ఇట్టి యుఱుములను, మెఱుపులను, నేనెప్పు డును చూడలేదే?

2 గోప—ఓరీ! మనము త్వరగా నిండ్లలోనికిఁ బోయి దాఁగికొందము రండు!

3 గోప—పాపము మన గోవులో?

2 గోప—దాని సంగతి రేపు చూడవచ్చును లెమ్ము!

కృష్ణు—స్నేహితులారా! నేనుండఁగ మీకేభయ మెందులకు? ప్రకృతి స్వభావమునఁ గాలమునకు వచ్చు వానకే మీరు తల్లడిల్లు చున్నారా? ఈవర్ష మెంత సొగసుగఁ గురియుచున్నదో చూడుఁడు!

1 గోప—ఇదియేమి సొగసుబాబూ! నీకిది యొక యాటగానున్నది కాఁబోలును! మాకుఁ బ్రాణసంకటముగా నున్నది. ఓ. ఓ. చలి. చలి.

(పైనుండి చినుకులును పెద్దవడగండ్లును బడుచున్నవి.)

3 గోప—బ్రతికియున్న బలుసాకేరి కొని తినవచ్చును. పరుగో! పల్లెకు!

(కృష్ణుఁడుగాఁక కొందఱవారు కలవరపడుచు పరుగెత్తి నిష్క్రమింతురు.)

కృష్ణు—(నవ్వి) నేఁదలంచినంత యైనది. మంచి వినోదము జరుగుచున్నది. మఖము మాన్పించితినని కోపించి దేవేంద్రుఁడీపని చేయుచున్నాఁడు. పాపము మాగొల్లలందఱు రాళ్ళవానకు భీతిల్లి యిండ్లకు ఱికినారు. వృథాప్రయాసముకాని దేవనాథుని రాళ్ళవానకాయిండ్లు మాత్రమాఁగునా? (కూలుములధ్వని) నిజము. అదిగో! మావ్రేపల్లెపైనే విశేషముగా రాళ్లు పడుచున్నవి. (ఆవులఱచుధ్వని) అరెరే! ఈసందడిలో నా ప్రియమిత్రములగు గోవుల మఱచితినే. అవియు రాళ్ళవానకు భయమంది యాఱ్చుచున్నవి అకటా! ప్రాణమునిస నీజంతుజాలమున కంతకు నింత భీతి యెందుసకో! (లోపలధ్వని) ఓహో! వ్రేపల్లెపైఁ బిడుగులు పడుచున్నవే! మావారే యపాయము నొంది యుండరుగదా! ఇండ్లు పోయినను మావారికి ప్రాణాపాయము గలుగకుండుగాక! ఇఁక దేవేంద్రుని యిష్టము వచ్చినట్లు రాళ్ళు రువ్వనిమ్ము.

(తెఱలోఁ గలకలము)

అరరే! చిత్రము! ఏరికి అపాయముఁ గలుగకున్నను అందఱును భీతిల్లి మావారలా ఘుల్లుగూల నీయింటిలోను, నాచెట్టు విఱుగ

నీచెట్టుక్రిందను, నీపుట్టక్రిందను, నీపుట్టగూల నింకొక పుట్టచాటునను నెట్లుండుకు చున్నారో! వెట్టులారా! ఆ ప్రయత్నము లన్నియు మిమ్ముఁ గావలేవుసుఁడీ! నాకడకు వచ్చినఁగాని మీకు క్షేమము దొరకదు.

తే. గీ. ఆపదలు గల్గునపుడు టీ ♦ వాళి యెల్ల
ఢీలిఁ ట్టిలు గొట్టుక ♦ పెనఁగుకంటె
జిత్తమున నన్ను నొక్కింత ♦ చింతసేసి
శరణటన్న బాధలవెల్ల ♦ సమసిపోవె.

ఓహోహో! పల్లెలోని యిండ్లన్నియుఁ బడిసమాప్తి యగుటచేఁ గాఁబోలు మాగొల్లలందఱు, విఱిగి పైబడునను భయముచేతఁ జెట్ల క్రింద దాఁగనొల్లక బయలున నట్టిటు లుఱుకుచున్నారు. ఏమి వీరి యున్మాదము. పరుగిడినంతనే పైనుండి పడుతాళ్ళదెబ్బలు తప్పునా? ఏదీ మాయమవీరులందఱును? ఇప్పుడు వారివీరత్వమేమి పనికివచ్చును?

(లోపల) కృష్ణా! ఎక్కడనున్నావు?

కృష్ణు—వీరెవరు? ఓహో! నాగోపికలారా! ఇంతసేపటి నుండియు వీరి సంగతియే మఱచి పోయితిని. పాపము వీరు చలిలోఁదడిసి యెంత వణఁకుచున్నారో! అకటా! వీరిలో ముసలివారు కూడఁ జాలమంది యున్నారే! ఇదిగో! ఒక గోపిక యిటు వచ్చుచున్నది.

ప్రవేశము—గోపిక.

గోపిక—కృష్ణా! ఎక్కడ నున్నావు?

కృష్ణు—ఇక్కడ! ఇక్కడ! ఏమి యుపద్రవము వచ్చినది? అట్లు కేకలు వేయుచున్నావు!

పిక—నీవు చూచుచునే యుపద్రవమేమియని యడిగెదవా? ఇదిగో నాభుజమును జూడుము. తాటిపండంత తాయి పడఁగానది యెంత నొచ్చుచున్న దనుకొంటివి?

కృష్ణు—ఏదీ చూడనిమ్ము! (భుజముపైఁ జేయిమోపి) ఇప్పుడేమాత్రము నొప్పిగా నున్నది?

గోపిక—మాధవా! నీవు నిజముగా మాపాలిటి దేవుడవే. నీవు చేయి మోపినంత మాత్రమున నాబాధయంతయుఁ బోయినది.

కృష్ణు—తక్కిన వారందఱు నెక్కడనున్నారు?

గోపిక—అందఱుఁ దలయొక దిక్కునకుఁ బోయి యున్నారు. కాని కొందరుమాత్రము మీతలిదండ్రుల చుట్టును జేరి మీమూలమున నింత వచ్చినదని వారిని దూషించు చున్నారు.

కృష్ణు—ఆ! నిజముగనా! మాయమ్మను, మాయయ్యను దూషించు చున్నారుగా! వారి తప్పేమున్నది? నీవిప్పుడే మఱలఁ బరుగెత్తి పోయి నేనిందున్నానని చెప్పి నాకడ కందఱను బిలుచుకొని రమ్ము. మీకేయుపాయమును లేకుండఁ గాపాడెద.

గోపిక—నీయొద్దనుండి పోయిన మఱల నాపై బాఁగ్లుపడునేమో!

కృష్ణు—ఏమియుఁ భడవు. ఒక్క పరుగునఁబోయి వారలందఱను రమ్మంటి ననుము. నాముద్దులాడివిగా! పొమ్ము.

(గోపిక నిష్క్రమించును)

కృష్ణు—ఇట ముదిరినది. చూచి నవ్వదగిన సమయము దాటిపోయినది. వీరిని గాపాడవలసిన యదను వచ్చినది. దేవేంద్రుఁడతని పంతముఁ గెలిచెనని యువ్విళ్ళూరు చున్నాఁడు గాఁబోలును. ఎట్లు? నేనుండగనే నాగొల్ల లొకనిచేత లొంగుదురా? వారి కొకనిచేత భయముకల్గునా! చూచెదగాక!

(లోపల నావులఱచు నడి)

అకటా! నాముద్దు దూడలపై నింతైన దయలేక కఠినశిల లెట్లు గురియించు చున్నారు! అమ్మా! నాకన్నుల పంటవగు తెల్ల యావు మెడనుండి రక్తము కారుచున్నదే. బాఁతిదెబ్బ తగిలినది యును! ఓ! దేవేంద్రా! ఇంక నీగర్వభంగము కాగలదు.

(ప్రవేశము—గొల్లలు, గోపికలు, బలరాముఁడు, నందుఁడు.)

బలరా—తమ్ముఁడా! నీవుచేసిన దాని పర్యవసానమును జూచితివా?

నందు—కుమారా! దేవనాథున కాగ్రహము వచ్చునని నేను ముందే చెప్పలేదా!

1 గొల్ల—మేమిప్పు డెందుఁ బోయెదము?

2 గొల్ల—ఈరాళ్ళవానలో బ్రతుకుట యెట్లు?

గోపికలు—మాధవా! మాగతి యేమిచెప్పెదవు?

కృష్ణు—ఆఁగుఁడు! ఆఁగుఁడు! అందఱొక్కసారిగా నన్నడిగిన నేరికి బదులుచెప్పువాఁడను?

బలరా—మేమందఱ మొక్కసారి ఱాళ్ళదెబ్బలు తినలేదా?

కృష్ణు—కొంచెమాఁగుఁడు! భయమేమియు లేదు. ఈవర్షమిప్పుడే తగ్గిపోఁగలదు.

(ఱాళ్ళవాన పడుచున్నది.)

గొల్లలు—అమ్మయ్యో! ఱాళ్ళవాన మావెంటాడుచున్నది. బాబో! ఈదెబ్బలకుఁ దాళలేము. దేవుఁడా! ఇంకెంతైన బాఱిపోయెదము.

(గోవుల యార్పులు)

బలరా—కృష్ణా! ఏమి యూరకున్నాఁడవు?

గోపికలు—స్వామీ! మమ్ము రక్షించుటకిదియే సమయము!

కృష్ణు—అన్నలారా! అక్కలారా! భయమందకుఁడు. ఓరీ ఇంద్రా! కృష్ణుని కడనున్న గొల్లల నొంచుట సులభ మనుకుంటివేమో పొరఁబడితివి?

శా. ఓరీ! గొల్లలు వెఱ్ఱిగొల్లలని నీ ♦ వుద్రేక సంరంభివై
కారుణ్యంబును మాని వృద్ధజనులుం ♦ గాంతామణుల్బాలురుఁ
ఘోరార్తింబడకుండ; భీతిఁగలఁగన్ ♦ గోయూథముల్; రాళ్ళమా
పై ఱువ్వఁగ, భవదీయమేఘవితతిం ♦ బంపించితే! దుర్మతీ!

ఉ. పంపిన నీదుమేఘము ల ♦ పారముగా శిల లెన్నొ మాపయిన్
నింపినఁ, గాలుచీఁకటులు ♦ నిండినఁజేరి మహాబలుండు బ
ల్తెంపుగవీచినన్, యశని ♦ తీవ్రతతో పయినాడుచున్న మా
కొంపలు గూలిపోయినను ♦ గొల్లలు లొంగరునీకు నింతయున్.

చ. బలముగలాఁడ నంచు సుర ♦ పట్టము నొందినరాజ నంచు, నా
పిలుపున నెల్లలోకములు ♦ భీతిఁ గలంగెదునంచు, వ్రజముం
గలుగు నటంచు నీవ్రకము♦ గర్వముతోడఁ దలంచితేమొ? నా
చెలులగువీరి నేమియును ♦ జేయఁగఁజాలవు నీబలంబునన్.

శా. లేరే, యింద్రులుమున్ను, దేవతలఁ బా ♦ లింపంగ? యాగాళిఁ గై
కోరే! వారలు నీవలెన్ జనులపైఁ ♦ గోపించి, యేపాప సం
చారం బెర్గనిగోగణంబుల వడిన్ ♦ జంపంగ రాలుర్వ్వఁగా
రారిల్లిన యెఱుఁగనే సురపురీ ♦ రాజేంద్రులం బెక్కుఱన్.

ఉ. నాయెడఁ గోపమూని సుర ♦ నాథుఁడవయ్యును నన్ను నేమియున్
జేయుంగలేక దీనులగు ♦ చిన్నల వృద్ధులఁజూచి వీరిపై
సేయఁగబూనినా వహహా! ♦ యేమని చెప్పుదునీదు శౌర్యమున్,
న్యాయము, దోషి సిగ్గిడచి ♦ యందఱి నేచుచునుండఁ బాడియే.

ఉ. గొల్లల నొంపఁజాలితిని ♦ కోరికదీరెఁగదా యటంచు నీ
వుల్లసమాడకేళిచట ♦ నుండఁగ గొల్లల కెగ్గురాదు వే
పల్లెయు, నింట్లుఁ బోయినను ♦ భద్రముసేసెదఁ జూడువీరి, నీ
వెల్లియు నాపయింగురియు ♦ మిచ్చతెఱంగున రాలవానలన్.

(వెనుకకుదిరిగి తనవారినిజూచి.)

తే. గీ. భయముఁ జెందకుఁడింక మీా ♦ పయినిరాళ్లు
కురియునంచు నేనిదిగో యీా ♦ గిరివరంబు
నెత్తిగోపులకును మీాకు ♦ నెల్లరకును
పట్టువాఁడను దగునాత ♦ పత్రముగను.

రంపు, నాతోడరంపు. నేనుండ మిమ్మాపద్రియేమి చేయఁ గలదు?

బలరా—తమ్ముఁడా! ఏమనుచుంటివి? ఈపర్వతమునెత్తి మాకు గొడుగుగాఁ బట్టెద ననియా?

అందఱు—మాధవా! మముఁ ద్వరగా నెందైనఁ గొనిపొమ్ము. ఈరాళ్ల దెబ్బలకుఁ దాళఁజాలకున్నాము.

కృష్ణ— వేఁగా శంకసేయక నాతోడరంపు. (పర్వతమును సమీపించి) పర్వతరాజమా! నీవిన్ని దినముల నుండియు మాగోవులకు వలయునంత కసవు నిచ్చుచుండుటచేతనే గాక, మాపర్వతకులమున కంతకును శత్రువగు దేవేంద్రుడు నావారిని నిలువనీకుండుటచే నీయుదనున నీవు తప్పక మాకుఁ దోడ్పడి యుపయోగకారి వగుదువుగాక!

తే. గీ. గిరివరా! రాళ్లుమాపైని ♦ గురియకుండ
నేను నిన్ను ఛత్రంబుగా ♦ నెత్తుచుంటి
చలనమందకే కెంగేలి ♦ చివర నిలిచి
హిమశిలల నాపిక్కైలాన ♦ సహితగనుము.

(గోవర్ధనము నెత్తుచున్నాడు.)

గంపు—మన కృష్ణునికేమైనఁ బిచ్చిపట్టినదా! ఇదేమిపర్వతము నెత్తఁ బోవుచున్నాడేమి? ఆ! ఆ! ఆ! అట్లు నిజముగా నల్లలనాడి లేచునది పర్వతమేనా! ఆ! ఆ! నాకన్నులు సరిగాఁ జూచుచున్నవా? నాకుఁగూడ మనోభ్రాంతి కలుగలేదు గదా!

(అందఱు నాశ్చర్యమునుఁ బొందుచున్నారు.)

బలరా—మనము చూచునదంతయు నిజమే! మనల రక్షింప భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడిట్లు చేయుచున్నాఁడు. సందేహింపకుఁడు. మొదట నామహాత్మునికి నమస్కార మొనర్పుఁడు.

(అందఱు జాగిలఁబడి మొ్రక్కి లేచుచున్నారు.)

కృష్ణు—నాగోపకులారా! వెలుపల నింక నాలసించినచో మీపయిని రాళ్లు పడియుండును. తడయక లోపలికి రండు.

నందు—నాచేతులపై బెరిగిన చిన్నికృష్ణుడే యీపని చేయుట! ఓరీ! రామా! నీబుద్ధికూడ భ్రమ జెందలేదుగదా!

1 గొల్ల—ఆపెద్ద గట్టంతయు మాకృష్ణుని చిటికెనవ్రేలిపై నిలిచి యున్నదే!

గోపి—చూడు మాపర్వతిమెట్లు కదలక నిలిచియున్నదో!

నందు—మన చిన్నికృష్ణుడే!

కృష్ణు—మీరింకను వెలుపల నిలిచెద రేల? దీనిక్రిందకు రండు. బాలుడనై బలముచాలక దీనిని మీపై విడిచెదనేమోయని భయ మందుదురేమో? ఆసందియము వలదు.

శా. "బాలుండీతడు కొండ దోడ్తెచ్చి మహా ♦ భారంబు సైరింపఁగా
జాలండోయని దీనిక్రింద నిలువన్ ♦ శంకింపఁ గాఁబోలదీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరా ♦ చక్రంబుపైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీ ♦ క్రిందం బ్రమోదంబునన్"

(భాగవతము)

అన్నా! నీవేగి గోవుల నీక్రిందకుఁ దోలుకొనిరమ్ము. అందఱు నాకడకురండు. (అందఱుఁ బర్వతముక్రింద కేగుచున్నారు.)

గొల్లలు—ఆహా! ఇక్కడ యెంత హాయిగానున్నదో!

ముసలిగొల్లలు—వెచ్చగనున్నది.

1 గోపిక—ఇఁకనిక్కడ భయములేదు.

2 గోపిక—అమ్మయ్య! హాయిగనున్నది. నిద్ర వచ్చుచున్నది.

1 వ గొల్ల—అప్పుడు ఈవానలో వెలుపలకు పోలేము.

2 వ గోపకుడు—ఇక్కడనే నిద్రపోవుదము.

అందఱు—అవును. పరుందము.

(అందఱు శయనించి నిదురింతురు.)

దేవేం—(తీవ్రతతో ప్రవేశించి.)

మంజరీద్విపద.

భూనభోంతరమెల్ల ♦ పూజ్యమౌననుచు
నేమసముద్రంబు ♦ లేకమౌననుచు
ముష్కర గోపకుల్ ♦ మూఁడులోకములు
జలమయంబై సూర్య ♦ చంద్ర నక్షత్ర
వితతి పెన్నీటిలో ♦ వెతలందుననుచు
భీతిల్లి భ్రమజెంది ♦ బెదరి యీగొల్ల
లెల్లతల్లడమంద ♦ యీపర్వతములు
మారుమ్రోఁగంగ; నీ ♦ మహికంపమొంద
విద్యుత్ప్రకాశము ♦ లేవ్వలిగి యీజనుల
నంధులఁజేయుచు ♦ నంతటనిండు
సూర్యతేజమువోలె ♦ చూడంగలేని
జీవరాసులనెల్లఁ ♦ జీకాకుపఱుప;
"ఫెళు ఫెళ్లు" మనియొక్క ♦ పెట్టునభూమి
గోళంబుపగిలెనా ♦ ఘోరార్తినంది
యీభీరజనులెల్ల ♦ సడలియార్వంగ;
పిడుగులు పడునంత ♦ పెద్దయుఱుములును
వ్రేపల్లెవారికి ♦ వెఱపుగల్పింప;
నంతలోఁజీకటి ♦ యతిసాంద్రమగుచు

పరిసరారణ్య భూ ♦ ప్రాంతముల్ గ్రమ్మ
గోవులార్చుచు వచ్చి ♦ గోష్ఠముల్ దూర
మంచు రాల్వానయు ♦ మబ్బులు మెరపు
లశని తేజంబులు ♦ నంధకారంబు
ముప్పిరిగొన్న యా ♦ గొప్ప మేఘముల
బలముతోఁ బగ మహా ♦ బలుఁడైన వాయు
దేవుండ! నీవు నీ ♦ ధీరతఁ జూపి
ఘోరవాతాహతి ♦ కుధరంబు లదరి
చలియింప నిచ్చటి ♦ సకలభూజములు
గూఁకటి వేళ్ళతోఁ ♦ గూడి కూలంగ
శిలలు వొండాకుల ♦ వలెనె పైకెగయఁ
నీగిరిగుహాలన్ని ♦ యొనసి ఘోషిల్ల
యాభీరజనముల ♦ యాపల్లెయంత
ధూళిలోఁ గలసి యు ♦ ధ్వాంతమై పోవ
వీపఁగా వలయును ♦ వెఱ్ఱిగొల్లలును
వారియావులను, వేరి ♦ పల్లెయు, మేఁక
బయళులు, సర్వంబుఁ ♦ బ్రబలుఁడా దేవ
నాథునియాగ్రహా ♦ నలమునఁ గూలు
దుష్టకీటకములై ♦ దురపిల్లవలయు
ఎల్లలోకము లేలు ♦ నింద్రునిసన్ను
తేలికపఱచి మ ♦ త్తిలియున్న గొల్ల
బాలుఁడీవానలోఁ ♦ బడికుందవలయు
వజ్రిపంతముదీరి ♦ వరలంగవలయు

(అటు నిటుఁ జూచి) ఇప్పుడు నాకు సంతోషముగా నున్నది. మనసు కుదుటఁబడినది. గోస్తనముల గుంజుకొని బ్రతుకు నీయాభీరులఁట! నన్ను ధిక్కరించి బ్రతుకుటయుట! ఎక్కడఁజూచినను వారలలో నొక్కఁడయినఁ గనబడకుండ నాశనమై పోయిరి. మేలయ్యె. (గోవర్ధన పర్వతమును జూచి) ఆ! ఇదియేమి? ఈపర్వతము నిజముగాఁ గదలుచున్నదేమిఁ కోపావేశములో నేఁజెప్పినట్లుగ, గాలిదేవుండీ పర్వతములతోఁబాటుగఁ గులపర్వతములఁగూడఁ గదలించుచున్నాఁడేమి? గొల్లల శిక్షించుట తప్ప యది నాపనిగాదే! ఎలుకను బట్టుటకుఁ గొండద్రవ్వటయా! ఓహో! ఇదేమి? ఈపర్వతముక్రింద గుహలో నెవ్వరో నరులున్నారు. గొల్లలే! నన్నుఁ దప్పించుకొనుటకీక్రింద దాగియున్నవారు గొల్లలే! ఆ! ఎట్లు వారందఱును, వారిమందలన్నిఁటితోఁ గూడ నిందే యున్నారే! ఈపర్వతము క్రింద యంత పెద్ద గుహయున్నది. కాదు. గుహకాదు. గుహకాదు. నేను బర్వతముల కన్నిఁటికి శత్రువు నగుటచేత నాకెదురై, వారినిఁ బోషించుటకీ గట్టుపైకెగిరి, వారిపై రాళ్ళఁ బడనీక కాపాడుచున్నయది. అదియెట్లు? ఎగురుట కాకొండ కేమైన ఱెక్కలున్నవా? మైనాకమొక్కటితప్ప తక్కినవన్నియు నాచేఱెక్కలు గొట్టఁబడి యుండలేదా. చిత్రము. (బాగుగఁ జూచి) అరే! ఆశ్చర్యము! ఇంతపర్వతమును నిజముగా నాచిన్నబాలుఁడే యెత్తియున్నాఁడా? నాకనులు భ్రమచెందలేదుగదా? ఒక్కటికాదు. రెండుకాదు. వేయి కన్నులు; అన్నియు మోసపోయియుండవు. ఔను నిజమే! నన్నుధిక్కరించిన ఆబాలుఁడే యీకొండనెత్తి పట్టియున్నాఁడు. ఔరా! వీఁడొక మాయావియగు రాక్షసుఁడు. కాకున్న నీకొండ నెత్తిపట్టఁగలుగునా? కాని నేను వీనినింతటితో విడిచితినేని నేఁజేసిన యీప్రయత్నమంతయు నేమిప్రయోజనము? ముల్లోకములవారు నన్నప్పుడు "గొల్లల కోడిపోయిన యింద్రుఁడీతఁడే" యని గేలికొట్టరా! తప్పక వీరిపనిఁబట్టిగాని మఱల నేను స్వర్గమునకుఁబోవను. ఐన నింతపనిజేయుచున్న యీబాలుఁడెవ్వఁడో ముందెఱుంగవలయును. కావున వీనితో మాటాడి, బెదరించెదను. (దగ్గరజేరి)

శా. ఓరీ! బాలక నీవెవండవు?

కృష్ణు— „ „ ఇట నీ ♦ వోరోరి, యంచెల్లరన్
జీరన్ వచ్చెదు నీవెవండవు?

ఇంద్రు— „ „ అమర ♦ శ్రీనేలి లోకాళి, నా
పేరేవిష్ణుఁ గలంగు నింద్రుఁడను—

కృష్ణు— „ „ నేఁ ♦ బెంపైన గోవర్గమె
వ్వారింగోరక మేపి యీయడవిలో ♦ వర్ధిల్లుగోపాలుఁడన్.

దేవేం—ఎట్లు? "ఎవ్వరినిగోరకయే నీవీయడవిలో గోవులమేపుచుంటివా
నాయాజ్ఞ లేకయే, చేయుచున్నావుగా? ఏమి నీగర్వము!

సీ. ఓరి? నీపేరేమి? ♦ „ „

కృష్ణు— పేరులెన్నియొవేలు
గలవందులో నేది ♦ గావలయును?

దేవేం—(తనలో) ఆ! ఏమి వీనిపొగరు!
నీనివాసంబేడ ♦ „ „

కృష్ణు— „ నిఖల జగంబులఁ
జెలఁగుదు నాకొక్క ♦ నెలవులేదు

దేవేం— జనకుఁడెవ్వఁడునీకు ♦ „ „

కృష్ణు— „ „ జనులకే జనకుఁడ
గాని నాజనకుండు ♦ గలుఁగఁడెందు

దేవేం—ఏమి నీతలబిరుసుదనము?

„ ఏరుచెప్పిరినీకు ♦ నీగర్వవాక్యముల్?

కృష్ణు— „ చెప్పెదనేనాకుఁ ♦ జెప్పరెవరు

దేవేం— „ నెత్తికట్టితివేల ♦ యీకొండనీరీతి?

కృష్ణు— „ గోవుల గొల్లలఁ ♦ గావఁగాను

దేవేం— ,, అట్లొనర్చుటనాకు ♦ నహితమంచెఱుఁగనే!

కృష్ణ— ,, యెఱిఁగియేచేసితి ♦ నేమిభయము

దేవేం—తే. గీ. దేవనాథుఁడు కోపింప ♦ దేవగణము
భయమునలదెడి నీకేల ♦ భయములేదు?

కృష్ణ— నాకునేనాథుఁడను ♦ వేఱునాథుఁడెవఁడు
నన్ను భయపెట్టఁగాలేడు ♦ నమ్మునిజము.

దేవేం—ఓరీ! వదరుబోతా! అమరేశ్వరుండ నగు నన్ను నల్పునిగా నెంచితివా?

కృష్ణ—కాని, గొల్లకుఱ్ఱనికంటె నెక్కుడ వాఁడవు?

దేవేం—నేననిన నీకింతయైన లక్ష్యము లేకున్నదే! ఓరీ! యాగముమానుమని వీరినేల బోధించితివి?

కృష్ణ—ఏలబోధింపఁగూడదు?

దేవేం—(తనలో) ఓహో! ఈనీచుఁడు నేనేమడిగినను సరియైనయుత్తర మీకున్నాఁడే! వీనితో నిఁక సామవాక్యములు పని పు. (ప్రకాశముగా) వాచాటా! నేనిప్పుడీ పర్వతము నీచేతినుండి యూడఁబెఱికి యావలవైచి యప్పుడు రాళ్ళు మఱింత నీపైని నీవారిపైని గురియించిన నేమిచేయఁగలవు?

కృష్ణ—ఏదీ! మొదట నీగట్టు నాచేతినుండియెత్తుము. చూతము.

దేవేం—ఆ! నన్నింక నధిక్షేపించు చుంటివిగా? ఇదే నీపొగరడంచెద. (గట్టునెత్తబోఁగా నది కదలకున్నది) ఏమి యీగట్టు! నాకును గదలుటలేదే! "గొల్లవానికున్నంత బలమైన నీకులేద" ని నన్నె వ్వరు నవ్వరా! ఉపూన్కి నింతటితో విడువను. ఓరీ! నీవు బాలకరూపధారినగు మహారాక్షసుఁడవు. కాని నాయాగ్రహానలమున కాఁగలేవుసుమా! పర్వతమునెత్తఁజాలకున్న నావజ్రాయుధముతో నిన్నును నీవెత్తినట్టి యీగట్టును వ్రక్కలగునటు

లేసిన నేమిసేసెదవు? (వజ్రాయుధముతో నఱుకఁబోఁగా నంత యుఁ జీఁకటియగుచున్నది. రాళ్ళవాన గాలి నిలిచిపోవును).

(శ్రీకృష్ణాదులపై తెఱదిగును).

దేవేం—(తూలుచు వెనుకపడి) ఆ! నిజమా! కల్లయా! కలయా! మాయయా! మర్మమా! యంత్రమా! తంత్రమా! నిజముగా నాకు జ్ఞప్తికివచ్చు దుండగములన్నియు నేనేచేసితినా? శ్రీకృష్ణావతారతేజుఁడగు జగన్నాయకున కింత యొగ్గుదలఁచినది నావాన నేనా? ఇతరులదా? లేక యిది యంతయు వట్టి భ్రమయా? కాదు. కాదు. నిజమే. మాయయ్యను దూషించినదీ గర్వోక్తి వదనమేనా? మానాథునకెదుటఁ జాగిలిపడక మొండికొయ్యనై నిలిచినదీ దుష్టతనువే? ఆతనిపై రాళ్ళుగురిపించినదీయింద్రుఁడే? మమ్ము నెన్నియోసార్లు కాచిన మహాత్మునిపై వజ్రము నెత్తిన దీకృతఘ్నుని హస్తములే? అవును. అవన్నియునీవే! ఆదుష్టుఁడు; ఆద్రోహి; ఆకృతఘ్నుఁడు; ఆపాపి; అనీచాతి నీచుఁడి యింద్రుఁడే; బృహస్పతీ! నీమాటనైన నేలవినకుంటిని! విని యుండిన సర్వేశ్వరునకింత దగ్గఱగవచ్చియు, దూరమైయుండనే! పాదములఁబడి పూజలొనర్ప సమయమువచ్చినను, దుష్టరాక్షసునివలె నాతనిపైఁ జేయియెత్తి యుండనే? ఏలవిందును? నా పాపు కోపము నాతల నావరించియుండ, గురుండవగు నిన్ను ధిక్కరించి పంపుదునుగాని సద్బోధనల విందునా? మేఘదేవతలారా! మీరు నేఁజెప్పినట్లేల చేసితిరి? మీకైనఁ దెలియ లేదా? నేఁజెప్పినట్లు రాళ్ళఁ గురియకున్న, నేను మిమ్మేమి చేసి యుండఁగలను? మీకు నిజముగ నధికారి యాయయ్యయే కదా! ఔను! నాకర్మమిట్లుండ మీరేల యన్యథా వర్తింతురు? వజ్రాయుధమా! నేనిన్ను నాస్వామిపై కెత్తినను, ఆతనికేహానియుఁ జేయకుంటచే, నీవు నాకు నన్మిత్రుండవుసుమా? నీమేలెప్పుడును మఱవను. ఛీ! నినుంబొగడు

చున్నావు. నీవు శ్రీకృష్ణపరమాత్మకు హానిచేయఁగలపాటిదాన
వా? ఎట్లు! నినుబోటి పాకకోటు లైన నాతని కొనగోటినంటఁ
గలవా? అట్లు నిన్నె త్రిప్పినను పాపపు నన్నేల తెగనాడక లేదు?
ఛీ! నీవు నాకు మిత్రుఁడవు కావు. శత్రుఁడవే. గోవర్ధన పర్వత
మా! నీవలె పుణ్యుఁడవు. పూజ్యుఁడవు. నాకుఁ బరమ మిత్రుఁ
డవు. శ్రీపతి కెంగేలిపై నిలుచు భాగ్యమ్ము నన్యులకబ్బునా?
ఆవలిని, అతనికిఁ బ్రియులగు గోపాలురను, గోవులను గాపాడు
పుణ్యమన్ని రాళ్ళకుఁ బట్టునా! నేనిన్నాతని చేతినుండి యూడఁ
బెఱికిఁ జూచినప్పుడు నీవు నాచేతికిఁ జిక్కుటచే నాకుఁ బరమ
మిత్రుఁడవు. అయ్యో! నాకు రానున్న బుద్ధియైన లేకుండె
గదా! నేఁ గురిపించిన ఘనఘనాళీమహావృష్టి నేమిచేయఁ జాల
కున్నను, నాతని గోవులను, గోపాలురను నెంతగా బాధించి
నవో! అందుచేత నాపై నాతని కెంతయాగ్రహము వచ్చెనో!
అక్కటా! ఈపాపమునకు నన్నాతఁడు క్షమించునా? ఈదుష్ట
దుండగమును మదిలో నెంచకుండునా? అయ్యో! నా పరమా
త్మయే కోపించిన నాకింక నేదిదిక్కు? ఏది మార్గము! ఏది స్వ
ర్గము! ఏది దేవేంద్రత్వము! మాయయ్య నను రక్షింపకున్న, నవి
న్నియుఁ గాల్పనా? ఇఁక నాకిన్నియు నెందులకు? హా! దేవ
దేవా!

ఉ. కన్నుల మాయ గప్పికొనెఁ ♦ గర్మవశంబున నిన్ను, శ్రీశ, నా
పన్నశరణ్య, దీనజన ♦ బాంధవ! గానక ద్రోహబుద్ధి నే
నెన్నియొ యెగ్గు లాడి, మఱి ♦ యింతయుఁ జేసితి నిట్టిపాపిన౯
మన్ననసేయు మంచడుగ ♦ మానస మొప్పదె కేమి సేయుదు౯?

చ. వెలఁగిన గర్వభారమునఁ ♦ జిత్తమునందున మేలు కీడులుం
దెలియక చేసినాఁడ, నవి ♦ ధీయుతుఁడవై కనుఁగొన్న నేరము౯
చెలఁగెడువానిఁ గోపమున ♦ దండన కర్హుఁడ నౌదు, కానినీ
వలఁగక నట్ల క్షమియించి మహా ♦ త్మాంచిత [illegible] రాఁగదే.

సీ. లానితనీలరో • లంబవేణీభార
మిరుల దిక్కులనిండఁ • బఱఁగఁజేయఁ
గలికివాల్గన్నుల • చలన విలాసంబు
ధీరుల మతులన్ని • సీరుపఱుప
లలిత వాక్చాతురీ • విలసనం బాకొన్న
జనుల వశ్యులఁజేసి • కొని చెలంగ
మృదుల పాదద్వయ • సదమల తేజంబు
పల్లవారుణకాంతి • బారఁదోల
తే. గీ. మేనిసౌష్ఠనంబును గాంచి • మానసములు
నేఱుతలఁపక ముల్లోక • వితతి మూఁడ
సమ్మృత మమరులకును బంచి • సట్టి, రుచిర
దివ్యతరమూర్తి మోహినీ • దేవిఁ దలఁతు.

మత్తకోకిల.

భామిణీఫేల మెల్ల మున్నతి • దారుణ ప్రళయంబునన్
ఘోరమా జలరాశిలోఁబడి • క్రుంగ ధారుణినెత్తి యా
క్రూరుఁడౌ దనుజేంద్రునిన్ • దనగొప్ప కోరలఁ బీల్చి
బోరి కూల్చినసూకరేశ్వరుఁ • పూజ్యబుద్ధిఁ దలంచెదన్

సీ. నేత్రద్వయమునుండి • నెగసుకోపారుణ
కాంతికి భాకుసుల్ • గను వణంక
వక్రదంష్ట్రాంచిత • వదనగహ్వరఘన
గర్జనంబులకు జ • గంబు గదల
శితనఖపంక్తిశో • ణిత మీాఱి, రాకుసే
శ్వగరక్తధారల • వరుసఁ గురియ
జంఘుపరిదేశంబు • సంహృతాసుర నాశ
ఘనకళేబరభార • మును వహింపఁ

## గోవర్ధనోద్ధారణము.

తే. గీ. పాదపల్లవములచెల్వు ♦ బాలకునకు
నమితభక్తి ప్రభావంబు ♦ నంత దెలుప
బ్రహ్మరుద్రాదిసురలకు ♦ భయముదోప
నసురఁద్రుంచిన నరసింహు ♦ నాత్మనెంతు.

సుగంధివృత్తము.

జయము నంది మమ్ముల బలి ♦ చక్రవర్తి స్వర్గమున్
భయములేక యేలుచుండ ♦ భంగపెట్టి యావిన్
రయముగాను గ్రిందలోక ♦ రాజ్య మేలఁబంపి, యే
పయను వామనుండు బ్రోచెఁ ♦ దలఁతు నట్టికూరిమిన్.

ఉ. క్షత్రియుఁ డెవ్వఁడో పితరుఁ ♦ జంపె నటంచును గోపమూని యా
క్షత్రియు లందఱన్ దెలఁగి ♦ సంహరియించుచు, స్వర్గభూమినిన్
క్షత్రియమూర్ధకోట వెస ♦ నెం బలుమొత్తము గట్టిసుట్టి, యా
క్షత్రియహంత నెంతు సతి ♦ సాహసు భార్గవ రామనామునిన్ .

మాలినివృత్తము.

తానుకులంబునఁ బుట్టి ధరాసుత ♦ భార్యగ గైకొని, తండ్రి నిజం
బానయు నిల్పఁగఁ గానడవిం జని ♦ యంగనఁ గోల్పడి రాక్షసునిన్
వానరవీరుల సాయముతో ధర ♦ వ్రాలఁగఁ ద్రుమ్మి, నిజాశ్రితులన్
బూని ముదంబునఁ దేల్చిన రామునిఁ ♦ పూజిత నామునినెంతుమదిన్.

సీ. దేవకీవసుదేవ ♦ దివ్యపుణ్యఫలంబు
నందయశోదాభి ♦ నందనంబు
వరమునిమానస ♦ పంజరకీరంబు
వల్లవీజననేత్ర ♦ వైభవంబు
కలుషరాక్షసమత్త ♦ గజసింహరాజంబు
దివిజహృత్సారసేం ♦ దిందిరంబు
సజ్జనకానన ♦ హరిణాగ్ని తేజంబు
పుణ్యజనాళీప్ర ♦ పూజితంబు

తే. గీ. నీవు కోపమూన • నిల్వ వేఱొక చోటు
లేదు మాకు, నెచట • నాదరణము
కలుగ దఖిలలోక • కర్తవీ వెచటను
జేర మేము నీదు • వార మయ్య.

అయ్యయో! ఇంకను మాయయ్యకు నాపై నలుక పోలేదా? కృష్ణా! మాధవా! భవత్కరుణాతేజః ప్రసారమున మదీయాజ్ఞానాంధకారము దొలఁగింపుము. లేకున్న నాకు వేఱు శరణంబు లేదు. నాయొనర్చిన దానికై నేనందుచున్న పశ్చాత్తాప మింతయని చెప్పుటకు నానోరు చాలకున్నది. ఐననేమి? నామనస్సునఁగల దంతయుఁ దెలియఁజాలిన నీకు నేనోటితో వేఱుగఁ జెప్పవలెనా? అంతయు నీవెఱుఁగుదువు. నీకుఁ దెలియనిది లీలావిభూతియందును, నిత్య విభూతియందు మఱి యొందును లేదు, కావున నీకుఁ బ్రియుఁడై నీయనంత మహాత్మ్యమెఱుంగఁ జాలినవాఁడే మహాత్ముఁడు. నీపాదపద్మము లానిన భూమియే పుణ్యభూమి. నీకైంకర్యమున నుపయుక్తములగు నేపదార్థములైనను పవిత్రములే; తదితరములు నన్నుఁబోలు జ్ఞానశూన్యులచే మెచ్చఁబడు దుర్గుణప్రియములు.

సీ. నీకు వందన మిడ • లేకున్న జగములఁ
గలఁగింపఁదగు బాహు • బల మదేల?
నీచింత లేకున్న • నిష్ఠాగరిష్ఠతఁ
దవిలి చేసెడి గొప్ప • తపము లేల?
నీపాదజలజసా • న్నిధ్యమునను వ్రాలి
శరణు వేఁడనిపది • శిరము లేల?
నీమూర్తిదర్శించునింపు • సంతోషంబుఁ
గాంచకుండిన వేయు • కన్ను లేల?

పరబ్రహ్మంబును బాధింపఁ జాలిన బలవంతుఁడవా! నీవలెక కార్యమా? నీచేగాదు. వేయిసార్లు ప్రళయవృష్టి కురిపింపఁ గల్గినను నా మహామహుని పాదరేణువునైనఁ గదల్పఁ గల్గుదువఁటరా! నీవు నొప్పించినపద (మింతెన) కలిపీడితకరంబులగు గోపాలక గోబృందంబులను, అందుకొఱకే యా దేవదేవుని కింత యాగ్రహము కలిగినది. లేకున్నఁ గలుగనే కలుగదు. అతఁడాశ్రిత వర్గములగు గోయూథములను, గోపాలురను నొప్పింప కుండిన నీపై నాతఁడు కోపించియే యుండఁడు. కావున నీ యొజ్జలకు లోనై యార్తినొందిన గోపాలురను గోవులను క్షమింపఁ వేఁడుకొనుము. అప్పుడు నీపై నీయయ్యకుఁ గరుణవచ్చును. హౌను నిజమే. అట్లు చేసెదను.

సీ. మునుల కందఁగరాని ♦ ఘనుని సేవ్యుని గాఁగఁ
బడసినగోపాల ♦ బాలురార!
బ్రహ్మకైనను లేని ♦ పరమేశుసంసేవ
గలిగినగోపికా ♦ కాంతలార!
హరి కౌగిలింతలో మిమ్ము ♦ నిరతంబుఁ గాపాడ
గురుపుణ్యనిధులైన ♦ గోవులార!
వైకుంఠవాసుని ♦ వరలునాయూరనే
మనుచున్న వ్రేపల్లె ♦ జనములార!

తే. గీ. వినుఁడి కోపనై నేమిమ్ము ♦ వెతలనందఁ
జేయ రాళ్ళవానకురిపించి ♦ శ్రీహరియెడ
గొప్పనేరము సల్పితిఁ ♦ గూర్మిసన్ను
వేఁ క్షమింపరె దండముల్ ♦ వేయునిపుడు.

(నమస్కరించును. తెరయెత్తఁబడఁగా అంతయు వెలుగునను గోవర్ధనగిరి గుహలో నిద్రించు గోపాలురు; గోపికలు; గోవులు; మురళి వాయించు కృష్ణుఁడు కనఁబడుదురు.)

దేవేం—ఎట్లు! నిజముగా నాభాగ్యము పండెనా! నా శ్రీకృష్ణుని. నా చిన్నికృష్ణుని, నా నల్లకృష్ణుని, గోపికానాథుఁడగు నాకృష్ణుని సర్వలోక పూజ్యుండగు నాకృష్ణు జూచు భాగ్యమబ్బెనా!

ఉ. శ్రీహరీ! నీపదాబ్జములఁ ♦ జిత్తము నిల్పలపోసి కార్ల సం
దోహములెల్ల నిండుమతి ♦ తోడను నీపరమంచు నెంచియే
మోహమునందుఁ గ్రుంకకయె ♦ మూర్ధముపైకనయుంబువంచి, వే
రూహలఁబోకయున్న విమ ♦ లోన్నతి సౌఖ్యపదంబులందరే!

ఉ. ఎవ్వఁడులోకసంచయము ♦ నెప్పుడు కూరిమిఁబోషించు; నబ్జజుం
డెవ్వనిపాదపద్మముల ♦ నిచ్చమెయిన్ భజియించి ధీమతిన్
నివ్వటిలంగ సృష్టిగడు ♦ నేరుపుతో నొనరింపఁజాలునే
నవ్విభుపాదపద్మముల ♦ నత్యనురాగముతో భజించెదన్.

ధన్యోస్మి! ధన్యోస్మి! (శ్రీకృష్ణుని పాదములపైఁ బడును).

కృష్ణు—దేవరాజా! వందనములు! వందనములు! ఈకుఱ్ఱవానిపాదముల తాము ముట్టఁదగునా? ఇది పెద్దలుఁ జూచిన నన్ను నింద సేయుదురు. దయయుంచి లెండు. (లేవనెత్తి) ఇప్పుడు జరిగిన పనికై మీరు వగవకుఁడు. మనమిద్దఱము చాలకాలమునాఁటి నెయ్యులముగదా!

దేవేం—కృష్ణా! నీతో నెయ్యుఁడగా నుండఁదగినంత వాఁడనా? నీ భృత్యుండను.

కృష్ణు—అట్లెప్పటికి సెలవీయఁజనదు. తాము సర్వలోక పూజ్యులు. నాయుత్సాహము కొఱకీ చిత్రవిచిత్రనాటకము మీచే నాడించితిని. అంతే యేగాని వేరేమియున్నది!

దేవేం—(నవ్వి) దేవదేవా! ఏనాటకమెవ్వరిచే నాడించుటకును సర్వజగన్నాటక సూత్రధారివగు నీవ సమర్థుఁడవు. సర్వకార్యంబులు నీలీలానము కొఱకు ఈకృష్ణావతార నాటకంబున లోక శాంతి

కృష్ణు—(ఒక్కింతిసేపు మురళి వాయించి) తండ్రీ! తెల్లవారినది. లెండు. లెండు.

అందఱు—(మేల్కాంచి, ఒడళ్లు విఱుచుకొని, ఆవులింపుచు దిక్కులు చూచి ఆశ్చర్యము నటింతురు)

నందు—ఓరీ! కృష్ణా! రాత్రి యెంత చిత్రమైన కల వచ్చినదిరా!

కృష్ణు—నాన్నా! ఏమది?

నందు—పెద్దరాళ్ళవాన నేడపగళ్ళు రాత్రములు గురిసినదట. మనలను గోవులను, ముప్పతిప్పలు పెట్టినదట. వ్రేపల్లె కల్లోలమైనదట.

అందఱు—నాకు నట్టికలయే వచ్చినది. నాకట్టిదేవచ్చినది.

కృష్ణు—(నవ్వుచు) నాన్నా! నిన్నటిరేయి [illegible] పక్వాన్నము లెక్కువగా మెక్కుటచే నీడకల వచ్చినది. అదిగో చూడండి. వ్రేపల్లె యప్పటియట్లు కలకలలాడుచున్నది.

గోపిక—నీవీకొండను యెత్తి మాపై రాళ్ళవాన గుఱియకుండగ పట్టి నట్లు కల నాకువచ్చినది మాధవా!

అందఱు—ఔనౌను! నాకునట్లే. నాకునట్లే!

కృష్ణు—మేలు. మంచికల. నేనీపెద్దకొండనెత్తుటే! కలలోనైన నీకది వెఱ్ఱిగాదోపలేదా!

నందు—ఎట్లాయిననేమి' అందఱము క్షేమముగానున్నాము. లెండు. లెండు. లేఁగలను, తల్లిమొదవులవద్దకు తోలి పాలుదీయుఁడు. ఓరీ! పాలముంతల తోముఁడు. మనమువు వ్రేపల్లెకు. పండుగ వంటలఁదిని, చాలసేపీగట్టుకొద్ద మాన్నాము.

బలరా—ఔను! తండ్రీ! ఎట్టి యద్భుతానుభవములును తత్కాలము నకు నిజములు. ఆపిదప అనుదినకార్యములకు మఱలునప్పుడా యనుభవములే స్వప్నతుల్యము లగును. ఇది లోకమర్యాద. కావున నిట్లగుగాక!

# గోవర్ధనోద్ధారణము.

## భరతవాక్యము.

ఉ. ధారుణిగర్వభారమున • ధర్మ మధర్మ మెఱుంగ కుండఁగా
నేరుపుదీనులన్ వెతల • నింతియుఁగూర్పక, గోగణంబులన్
గూరిమిఁబ్రోచి మేఁతలిడి • గొప్పగఁగాంచుచు సర్వసంపదల్
చేరఁగ గృష్ణదేవుఁడును • చిత్తములందున నెంచుగావుతన్.

అందఱు—తథాస్తు.

(నిష్క్రమింతురు).

తే. గీ. అఖిలలోకేశు నవ్యయు • నాదిపురుషు
శ్రీశు, గోవిందు, నచ్యుతుఁ, • జింతఁజేసి
వ్రాయఁగల్గితినాటక • రాజమేను
వానికృప నన్నియునుజేయ • వలనుపడవె.

శ్రీశోభనాద్రీశ్వరో విజయతామ్.

శ్రీరామార్పణమస్తు.



శ్రీశోభనాద్రి లక్ష్మీనృసింహస్వామినేనమః.

## తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 16 | బాష | భాష |
| 3 | 6 | కెలవి | కెలమి |
| 2 | 23 | గంము | గెంము |
| 5 | 7 | యైనను | యై నను |
| 7 | 1 | ప్రథ | ప్రభ |
| 7 | 23 | సాన | శ్వాస |
| 8 | 8 | నాడ | పాడ |
| 12 | 25 | దార్ధ | దార్గ |
| 13 | 12 | మాట | మూట |
| 15 | 18 | శక్ర | శక్రు |
| 22 | 15 | నాధు | సాధు |
| 23 | 8 | నాథా | నాధా |
| 23 | 15 | గుమ్మరి | గ్రుమ్మరి |
| 27 | 2 | ప్రుస | ప్రుస |
| 28 | 18 | వానికి | వానికి బుద్ధి చెప్పుదురు. కాని యీయనకు దూరం ఉట్లు నొక్క |
| 28 | 19 | వర్తిం | వర్తం |
| 28 | 20 | వారం | వా రం |
| 40 | 14 | జేయు | కేయు |
| 43 | 5 | ప్రపె | ప్రవే |
| 46 | 6 | విఘ్న | విఘ్న |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 48 | 19 | దుసు | దును |
| 50 | 2 | వంత | పంత |
| 50 | 13 | దుసర్గ | ఘుసర్గ |
| 52 | 13 | వట్టి | సట్టి |
| 54 | 7 | భస | భవ |
| 54 | 23 | సది | పది |
| 54 | 25 | కుఁ | కుం |
| 56 | 7 | గోవా | గోపా |
| 58 | 5 | డవ | డస |
| 58 | 13 | వస | వస |
| 59 | 7 | ఎమ | ఫేమ |
| 59 | 8 | ళ్ళ | క్ళ్ళ |
| 59 | 10 | టె | ట్రి |
| 59 | 11 | ష్ణ | ష్ణ |
| 59 | 22 | హా | నా |
| 59 | 24 | పకు | సపు |



